ప్రధానవ్యాధులయొక్క కొన్ని కొన్ని సముదాయగుణములు మాత్రమే యిందుద హరింపబడినవి. యిం దుదహరింపబడినవాటికంటె ఎతము వైశిష్ట్యము, తత్తత్కా లసంప్రాప్తమగునట్టియు రోగములయందు కలిగెడు గుణములను వైద్యులు తమ బుద్ధిచేతనే యూహింపవలసియున్నది. ||౧||

—◆త్రిదోషసామాన్యవిజ్ఞానమ్◆—

శ్లో॥ న వాతేన వినా శూలా న కండూః శ్లేష్మణా వినా ।
న పిత్తేన వినా ఛర్ది ర్నాజీర్ణేన వినా జ్వరః॥ ||౨||

వాతదోషము లేకుండ శూలయు, శ్లేష్మదోషములేకుండ దురదయు, పిత్తదో షములేకుండ ఛర్దియు, అజీర్ణదోషము (ఆమదోషము) లేకుండ జ్వరము నుకలుగవు ||౨||

—◆జ్వరసంప్రాప్తి◆—

శ్లో॥ మిథ్యాహారవిహారాభ్యాం దోషా హ్యామాశయాశ్రయాః ।
బహి ర్నిరస్య కోష్ఠాగ్నిం జ్వరదాస్స్యూ రసానుగాః॥ ||౩||

ప్రకృతికి విరుద్ధము లైన (తత్త్వమునకు సరిపడని) ఆహారవిహారములవలన వా తపిత్తశ్లేష్మములు జఠరాగ్నికి మాంద్యమును కలుగజేసి రసధాతువు నాశ్రయించి జఠరాగ్నిని వెలికిత్రోసి జ్వరమును కలుగజేయును. ||౩||

శ్లో॥ వాతాదిదోషాః కుపితాః ప్రకామ
మామాశయం ప్రాప్య చ తత్ర కోష్ఠే ।
అజీర్ణితాహారరసేనయుక్తా
స్స్రోతాంసి రూపాని పిధాయ నూనమ్॥
బహి ర్నిరస్యాగ్ని మమీ తు తేన
వ్యాప్తా స్సమంతా జ్జ్వరదా శ్శరీరే ।
స్రోతో నిబంధా జ్జ్వరసంయుతేషు
జ్వరో న భూయా ద్బహుళామయేషు॥ ||౪||

వాతాదిదోషములు తమ తమ స్థానములయందు వృద్ధిచెంది, జీర్ణాశయమున ప్రవేశించి, అక్కడ నున్న అన్నరసముతో కలిసిపోయి నాడీద్వారముల నడ్డగించి, అంతర్గతమైన జఠరాగ్నిని బహిర్గతము గావించి, ఆజఠరాగ్నితోపాటు తాముకూడ శరీర మంతయు వ్యాపించి జ్వరమును కలుగజేయుచున్నవి. నాడీద్వారములు ఆజీ

ష్ఠితాజీర్ణరసముచే (ఆమదోషముచే) ఆస్థగింపబడుటవలన వివిధములైన రోగములు గల జ్వరితులకు చెమట పట్టదు. ॥౯॥

—♦జ్వరసామాన్యలక్షణమ్♦—

శ్లో॥ స్వేదావరోధ స్సంతాప స్సర్వాంగగ్రహణం తథా ।
యుగపద్యత్ర రోగే చ స జ్వరో వ్యపదిశ్యతే॥ ॥౧౦॥

చెమట పట్టకపోవుట, దేహము, మనస్సు, ఇంద్రియములు, వీటియందు సంతాపము, సమస్తేంద్రియములయందు వేదన, యీలక్షణములు ఏకకాలమునం దెప్పుడు కలుగుచున్నవో, అదియే జ్వర మని చెప్పబడుచున్నది. ॥౧౦॥

—♦జ్వరమున కవస్థాచతుష్టయం♦—

శ్లో॥ ఆమా త్రిభి స్సప్తభి రేవ పచ్య
మానా తథా దోషవినశ్యమానా ।
దినై ర్నిరామేతి దశోర్ధ్వమానై
ర్దశా వివిక్తా స్సకలజ్వరేషు॥ ॥౧౧॥

సర్వవిధజ్వరములయందును మూడు రోజులవరకు ఆమావస్థ, ఏడురోజులవరకు పచ్యమానావస్థ, పదిరోజులవరకు దోషవినశ్యమానావస్థ, పదిరోజులకు పిమ్మట నిరామావస్థ అని యీప్రకారముగా నాలుగువిధము లయిన అవస్థలు నిర్ణయింపబడినవి. ॥౧౧॥

—♦ఆమావస్థాలక్షణం♦—

శ్లో॥ హృల్లాసశూలా వమిగాత్రభార
మాంద్యాధికాలస్య విపాకతంద్రాః ।
క్షున్నాశవైరస్య హృషీకవర్గ
స్తబ్ధత్వ మామస్య వదం త్యవస్థామ్॥ ॥౧౨॥

రసాదిధాతువులయందలి మలములున్ను, వాతాదిదోషములున్ను, పక్వము గానంతవర కుండు జ్వరము ఆమ మనియు, పక్వమైనపిదప నిరామ మనియు చెప్పబడును. ఆమజ్వరమందు పసరు కలిగిన బాధ, నోట చొల్లు కారుట, ఓకిరింత, శరీరము బరువుగా నుండుట, మూత్రము ననేకసార్లు విడుచుట, పనులయం దాసక్తి లేకుండుట, అజీర్ణము, మైకము, ఆకలి లేకుండుట, రుచి తెలియకుండుట. అవయవములు

పెుుక్కపొరి రయుంచుట. యిట్టి లక్షణములు కలిగియుండును. ఆమజ్వర మనగా అపక్వజ్వరము. ॥౧౨॥

## పచ్యమానావస్థాలక్షణం

శ్లో॥ జ్వరస్య శీఘ్రాగమనప్రలాప
శ్వాసభ్రమత్రృణ్మలవిట్ప్రవృత్తిః।
పక్వేషు దోషాదిషు పచ్యమానా
వస్థాం నిగద్యంతి వమిప్రసూతిం॥ ॥౧౩॥

పచ్యమానజ్వరమందు దోషములున్ను, మలములున్ను, పరిపాకమును పొందు చుండ జ్వరము వేగముగావచ్చుట, అసందర్భముగా మాట్లాడుట, శ్వాస, (ఆయా సము,) ఒపలుతిరుగుట, దాహము, మలమూత్రవిసర్జనము, (మలమూత్రములు ధారా ళముగాపోవుట,) వాంతిగుణము (డోకురాబోవునట్లుండుట) కలిగియుండును. పచ్య మానజ్వరమనగా పాకోన్ముఖమైనజ్వరము. ॥౧౩॥

## దోషవినశ్యమానావస్థాలక్షణం

శ్లో॥ దంతాః కుందసమానకాంతికలితా నాడీగతిర్నిర్మలా
జిహ్వాఘ్రాణరుచిజ్ఞతా శుభమతి శ్స్వేదోద్భవః ప్రాశనే॥
రేఖాపత్మ్రనఖాక్షిరక్తజననం సంతోషసంభాషణం
ప్రజ్ఞాదోషవినశ్యమాననియమావస్థా నిరామాంతికా॥ ॥౧౪॥

నిరామావస్థకు సమీపముగున్న దోషవినశ్యమానావస్థయందు దంతములు మల్లిమొగ్గలవలె తెల్లగానుండుట, నాడి నిర్మలముగానడచుట నాలుకకు రుచియు, ముక్కునకు వాసనయు తెలియుట, ధారాళమైన తెలివి దాహముపొందనైనవి త్రుచ్చుకొని నవెంటనే చెమటపట్టుట. అరిచేతులు. అరికాళ్ళు వీటియందుగల రేఖలు, కంటి రెప్పలు గోళ్ళు, కన్నులు వీటియందు రక్తముకనపించుట, సంతోషముగా మాట్లా డుట, జ్ఞానశక్తి యిట్టిలక్షణములుకలిగియుండును. ॥౧౪॥

## నిరామావస్థాలక్షణం

శ్లో॥ లఘుత్వ మంగేషు శరీరశక్తి
ర్మదన్నలిప్సా గమనాభిలాషః।
త్రిదోషసామ్యం నిఘనాంఽజరత్వాం
కాంతి ర్నిరామస్య వదం త్యవస్థాం॥ ॥౧౫॥

నిరామజ్వరము (మలములున్ను, దోషములున్ను సంపూర్తిగా పరిపాకమును పొందినజ్వరము)నందు ఆశయములన్నియు తేలికగానుండుట, శరీరము పటుత్వముగానుండుట, సంతోషము, అన్నమందభిలాష, (భిషుజుండారములయందువాంఛ) లేచి నడుటకలెననుకోరిక, వాతపిత్తశ్లేష్మములు హెచ్చుతగ్గులులేక సరళముగానుండుట, భుజించినపిమ్మట జ్వరమురాకుండుట, శరీర కాంతి యిట్టిలక్షణములుకలిగియుండును.

## —♦ అంతర్వేగ (జ్వర) లక్షణం ♦—

శ్లో॥ అంతర్దాహోఽధి కస్తృష్ణా ప్రలాప శ్శ్వసనం భ్రమః।
అస్వేదసన్ధ్యస్థితాప దోషవర్చో వినిగ్రహాః॥ ॥౧౬॥

దేహాంతర్గతములైన హృదయాదులయందు వేగముసుచూపుజ్వరము అంతర్వేగజ్వరము. దీనియందు అంతరశయములయందు తాపము, దప్పిక, అసందర్భప్రలాపము, శ్వాస మతిభ్రమ (చిత్తచాంచల్యము) చెమటపట్టకుండుట, కీళ్ళసంధులయందును. ఎముకలయందును, నొప్పి, వాతాదిదోషములు, మలములు, మందగించి యుండుట యిట్టిలక్షణములు కలిగియుండును. ॥౧౬॥

## —♦ బహిర్వేగ (జ్వర) లక్షణం ♦—

శ్లో॥ సంతాప స్త్వధికో బాహ్య స్తృష్ణాదీనాం సుమార్దవం।
బహిర్వేగస్య లింగాని సుఖసాధ్యత్వ మేవ చ॥ ॥౧౭॥

చర్మముపైన వ్యాపించినజ్వరము, బహిర్వేగజ్వరము, దీనియందు శరీరము యొక్క పైభాగమందు వేడిమి, (సంతాపము) స్వల్పమైనదాహము, ప్రలాపము, శ్వాస, భ్రమ, చెమట, సంధులయందు నొప్పికలిగియుండి చికిత్సకు సులభసాధ్యమై యుండును. ॥౧౭॥

## —♦ జ్వరభేదములు. ♦—

శ్లో॥ జ్వరా స్సమస్తాః పరిదృశ్యమానా
స్సామాన్యత స్సప్తవిధాః ప్రదిష్టాః।
దంద్వాభిఘాతానిలపిత్తభూత
శ్లేష్మైర్ణజీర్ణేన సదా నరాణాం॥ ॥౧౮॥

ద్వంద్వజరము, అభిఘాతజ్వరము, వాతజ్వరము, పిత్తజ్వరము, భూత (పిశాచ) జ్వరము, శ్లేష్మజ్వరము, అజీర్ణజ్వరము, అవి సామాన్యముగా జ్వరములు ఏడు విధములు. ॥౧౮॥

## —♦ శ్లేష్మ పైత్య జ్వరలక్షణం ♦—

శ్లో॥ ఉద్గారవాంతిజ్వరసోఫమూర్ఛా
నాహారుచి దాహాక్షి జలాతితాపాః।
అనిద్రితారాసనకంటకాశ్చ
స శ్లేష్మపిత్తజ్వరలక్షనాని॥ ॥౧౯॥

పైనచెప్పబడిన సప్తవిధజ్వరములలోచేరిన ద్వంద్వజ్వరములలో శ్లేష్మపిత్త జ్వరమునందు, ఓకిరింత, వాంతులు, జ్వరము, శోఫ (వాపు) మూర్ఛ, అనాహము, (కడుపుబ్బరము), అతిదాహము, కళ్ళు నీరుకారుట, తాపము, నిద్రపట్టకుండుట, నాలుకయందుముండ్లు యిట్టిలక్షణములు కలిగియుండును. ॥౧౯॥

## —♦ శ్లేష్మ వాతజ్వరక్షణం ♦—

శ్లో॥ అంగవ్యథా శ్లేష్మముఖాగ్నిమాంద్య
ప్రలాపరోమాంచ మలావరోధాః।
అనాహకంప శ్రవణాక్షిశూలా
శ్లేష్మానిలోత్థజ్వరలక్షణాని॥ ॥౨౦॥

శ్లేష్మవాతజ్వరమునందు శరీరమంతయు బాధ, శ్లేష్మసంబధమైన అగ్నిమాంద్యము, కలవాట్లు, (పలవరింతలు,) దేహము గగుర్పొడుచుట, మలబంధము, అనాహము, దేహము వణకుట, చెవులయందును, నేత్రములయందును శూల ఇట్టిలక్షణములు కలిగియుండును. ॥౨౦॥

## —♦ సీత పైత్యజ్వరలక్షణం ♦—

శ్లో॥ అంగవ్యథా సీలముఖాగ్నిమాంద్య
ప్రలాపనేత్రాంబుమలావరోధాః।
ఉద్గారనిద్రా వమనాతిదాహాః
పిత్తానిలోత్థజ్వరలక్షణాని॥ ॥౨౧॥

సీతపైత్యజ్వరమందు దేహమునందు బాధ, ముఖము వల్లబారుట, అగ్నిమాంద్యము, కలవాట్లు, కన్నులు నీరుకారుట, మలబంధము. వోకిరింత, నిద్ర, వాంతులు. అధికమైనదాహము కలిగియుండును. ॥౨౧॥

## —♦ అభిఘాతజ్వరలక్షణం ♦—

శ్లో. మతిభ్రమస్వేదసమస్తదేహ
వైకల్యశైత్యాశనదాహవాంఛాః
జ్వరేభిఘాతే బహుదూరమార్గ
ప్రయాణజే వ్యాపకసంభవేస్మిన్॥ ॥౨౨॥

దూరప్రయాణము చేయుటవల్లను, అధికమైన వ్యాపకముచేయుటవల్లను, సంభవించు స్వభావముగల అభిఘాతజ్వరమందు మతిభ్రమణము, చెమట. శరీరమంతయు నొప్పులు, దేహము చల్లబడుట, భోజనమందును, దాహమందును, అభిలాష యిట్టిలక్షణములు కలిగియుండును. ॥౨౨॥

## —♦ వాతజ్వరలక్షణం ♦—

శ్లో॥ ప్రలాపరోమాంచవిదాహకండూ
నీలాస్యవైకల్యమలావరోధాః।
అత్యుష్ణతాశీతలతాతితృష్ణా
ప్రోక్తాని వాతజ్వరలక్షణాని॥ ॥౨౩॥

వాతజ్వరమందు కలవాట్లు, శరీరము గరిపొడుచుట, విదాహము, దురదలు, ముఖమునలుపెక్కుట, మలబంధము, శరీరము మిక్కిలి వేడిగాగాని లేక మిక్కిలి చల్లగాగాని ఉండుట, నాలుక పెనిపెరొుట, యిట్టిలక్షణములు కలిగియుండును.

## —♦ పిత్తజ్వరలక్షణం ♦—

శ్లో॥ క్రోధాతినిద్రాధికదాహవాంతి
ప్రలాపహిక్కాస్యవిశోషమూర్ఛాః॥
పురీషమూత్రారుణతాతితాపా
స్స్యుమాని పిత్తజ్వరలక్షణాని॥ ॥౨౪॥

పైత్యజ్వరమందు దద్దుర్లు, అధికమైననిద్ర, విదాహము, వాంతులు, కలవాట్లు, ఎక్కిళ్ళు, ముఖము ఎండిపోవుట, మూర్ఛ, మూత్రపురీషములు యెర్రగానుండుట, యిట్టిలక్షణములు కలిగియుండును. ॥౨౪॥

## —♦ భూతజ్వరలక్షణం ♦—

శ్లో॥ ఉన్మాదకంపజ్వరభోజనాఽశా
విరూపదృఙ్నృత్తనహాస్యగీతాః।

ప్రలాపరోమాంచ శిరోతిబాధా
స్వేదశ్చ భూతజ్వరలక్షణాని॥ ॥౨౫॥

భూతజ్వరమునందు ఉన్మాదము (పిచ్చి) పట్టుట, జ్వరము, రోదనమందారు భయంకరమైనచూపు, ఏడుట, పాడుట, నవ్వుట, కలవాట్లు, గగుర్పాటు, శిరోవేదన, చెమట యిట్టిలక్షణములు కలిగియుండును. ॥౨౫॥

## ——♦ శ్లేష్మజ్వరలక్షణం ♦——

శ్లో॥ అనాహాశైత్యప్రలపాగ్నిమాంద్య
శ్వేతాస్యనిద్రావిరహాంగశూలాః।
శ్వాసాఽతికాసజ్వరవాంతిహిక్కా
శ్లేష్మప్రియుక్తజ్వరలక్షణాని ॥౨౬॥

శ్లేష్మజ్వరమందు అనాహము, శైత్యము, (పసరు) కలవాట్లు, అగ్నిమాంద్యము, ముఖము రక్తవిహీనమై తెల్లబారుట, నిద్రలేమి, దేహమునందుపోట్లు, శ్వాస అధికముగా వెడలుట, ఆయాసము, జ్వరము, వాంతులు, ఎక్కిళ్ళు, యిట్టిలక్షణములు కలిగియుండును. ॥౨౬॥

## ——♦ అజీర్ణజ్వరలక్షణం ♦——

శ్లో॥ అంగవ్యథా కాంతివిహీనదాహ
హృద్భ్రమాఽరుచిశ్వాసమలావరోధాః।
హిక్కాన్నవిద్వేషశిరోవ్యథాతి
జృంభాప్యజీర్ణజ్వరలక్షణాని॥ ॥౨౭॥

అజీర్ణజ్వరమందు శరీరమునబాధ, శరీరము కాంతివిహీనమైయుండును, దాహము, ఊపిరిగొట్టునొప్పి, అరుచి, శ్వాసతొందరగానడచుట, మలబంధము, ఎక్కిళ్ళు, అన్నమునందయిష్టము, శిరోవేదన, (తలనొప్పిలేకపోటు) ఆవలింతలు కలిగియుండును. ॥౨౭॥

## ——♦ విశేషజ్వరములు ♦——

శ్లో॥ భూతస్వేదాఽభిఘాతాఽనిల, విషమనిశా, స్ఫోటకా, గంతుకామ,
క్రోధా, నిద్రా, భిచారా, మధ, వమన, పురాణా, తృషా, నాహ, కాసాః।
మూర్ఛాం, తరాహ, శోష, వ్రణ, పికట, హారిద్రా, ప్రలాపా, ప్రచార
పాత్రి తర్మధ్వాహ్నసాయం, కృమి, దశవిధనాడీజకష్టాపి కాద్యాః ॥

(1) భూతజ్వరము, (2) స్వేదజ్వరము, (3) అభిఘాతజ్వరము, (4) అనిలజ్వరము, (5) విషమజ్వరము, (6) నిశాజ్వరము, (7) విస్ఫోటకజ్వరము. (8) ఆగంతుకజ్వరము, (9) ఆమజ్వరము, (10) క్రోధజ్వరము, (11) అనిద్రాజ్వరము, (12) అభిచారజ్వరము, (13) ఔషధజ్వరము, (14) శమనజ్వరము, (15) పురాణజ్వరము, (16) ఆతపజ్వరము, (17) అజాహజ్వరము, (18) కాసజ్వరము, (19) మూర్ఛాజ్వరము, (20) అంతర్దాహజ్వరము, (21) శోషజ్వరము, (22) క్షీణజ్వరము, (23) పిటకాజ్వరము, (24) హారిద్రాజ్వరము, (25) ప్రలాపజ్వరము, (26) అపచారజ్వరము, (27) ప్రాతఃకాలజ్వరము, (28) మధ్యాహ్నకాలజ్వరము, (29) సాయంకాలజ్వరము, (30) క్రిమిజ్వరము, (31) పిత్తజ్వరము, (32) శ్లేష్మజ్వరము, (33) వాతజ్వరము, (34) అజీర్ణజ్వరము, (35) సంశయజ్వరము. (36) సన్నిపాతజ్వరము, (37) శ్లేష్మపైత్యజ్వరము, (38) శ్లేష్మవాతజ్వరము, (39) వాతపైత్యజ్వరము, (40) శుష్కజ్వరము, (41) ఆహికజ్వరము, (ఏకాహికజ్వరము, ద్వ్యాహికజ్వరము, త్ర్యాహికజ్వరము, చాతుర్థికజ్వరము, అని ఆహికజ్వరము నాలుగువిధములు.) ఆడిశబ్దముచే (42) పక్షాంత, (43) మాసాంత, (44) వర్షాంత, (45) సంతతజ్వరంబు లూహ్యంబులు. ॥౨౮॥

## —♦ రోగవివక్షోపసంహారమ్. ♦—

శ్లో॥ పృథక్పృథగ్లక్ష్యవివక్షితా వా
రుజ స్త్వనంతాకృతయ స్సమూహ్యాః।
వైద్యై ర్యత స్తత్తదభిఖ్యయేతి
గ్రంథః ప్రపంచీకృత ఏవ నాత్ర॥ ॥౨౯॥

ప్రత్యేక ప్రత్యేకలక్షణములతో వేరువేరుగా వివరింపబడినను, రోగములు అనంతమైన రూపములుకలుగుటవలన వైద్యులచే వాటివాటి పేరులననుసరించియే ఊహింపతగియున్న రోగవివరణవిషయమై గ్రంథము విస్తరింపబడలేదు. అనగా సామాన్యాకారేణ చెప్పబడినదనుట. ॥౨౯॥

## —♦ సప్తవిధదోషము ♦—

శ్లో॥ విషమ శ్వేతకృష్ణాఽస్రపీతజిహ్వాకసంగమాః॥
విషమార్ద్రి స్సప్తధైవ మపథ్యా ద్దోషసంభవః॥ ॥3౦॥

జ్వరములయందు అపథ్యదోషములనను (1) విషమదోషము, (2) శ్వేతజిహ్వాకదోషము, (3) కృష్ణజిహ్వాకదోషము, (4) రక్తజిహ్వాకదోషము, (5) పీతజిహ్వాక

దోషము. (6) సంగమదోషము. (7) విషమశీతదోషముఅని ఏడువిధములైన దోషములు కలుగుచున్నవి. మఱియు,

విషమదోషమున:— నాడి వక్రగతిగానుండుట. మూర్ఛ. దాహము. తాపము, కడుపులోమంట, జ్వరమున్ను,

శ్వేతజిహ్వాకదోషమున:— నాలుక తెల్లగానుండుట. గొంతుక పగులుట. (గొంతుకలో ఊడికినట్లుండుట,) శరీరము నొచ్చుట, కంపము, భ్రమ, చమట, అతిసారము, కక్కుట. మూర్ఛయున్ను,

కృష్ణజిహ్వాకదోషమున:— నాలుక నలుపెక్కి పిడకకలైనుండుట, నాలుకపై ముండ్లు, తాపము, కలవరింతలు. ఆయాసము శరీరము దురదగానుండుట, దాహము,

రక్తజిహ్వాకదోషమున:— నాలుక ఎరుపు. నాలుకపైముండ్లు, జ్వరము. దాహము. తాపమును.

పీతజిహ్వాకదోషమున:— నాలుక పసుపు, నాలుక పగిలి తడిలేక ముండ్లుకలిగియుండుట, జ్వరము. భ్రమ, మూర్ఛ. ఎక్కిళ్ళును.

స్త్రీసంగమదోషమున:— శరీరము చితుకకొట్టినట్లుండుట. వణకు, గుండెలో మంట, కలవరింతలు. తాపము, కాళ్ళు, చేతులు చల్లబడుట.

విషమశీతదోషమున:— రోజునకు నాలుగైదుపొద్దు చలియు, జ్వరమును, వచ్చుట, దాహము, భ్రమ, తలనొప్పి, నాలుక కఠినమై ముండ్లుకలిగియుండుట, ఇట్టిలక్షణములు కలిగియుండును. ఈవిధముగా దోషలక్షణసంగ్రహము తెలియవలెను. ॥౩౦॥

## — జ్వరదినపరిమాణం —

శ్లో॥ పిత్తజ్వరే షడ్దివసాని సప్త
వాతే నవ శ్లేష్మణి దోషజేషు।
పక్షం త్వదంతే జ్వరతో విముక్తి
ర్నస్యాత్తత్పురాణజ్వరసాధనాని॥ ॥౩౧॥

పిత్తజ్వరమునకు, ఆరు, వాతజ్వరమునకుఏడు, శ్లేష్మజ్వరమునకు తొమ్మిది దోషజ్వరమునకు పదిహేను, పరిమాణదివసములైయున్నవి, ఈపరిమాణప్రకారముగా జ్వరములు విడవనిచో పురాణజ్వరమునకుచేయు చికిత్సలను చేయవలయును ॥౩౧.

శ్లో॥ సప్తాహేనైవ పచ్యన్తే సప్తధాతుగతా మలాః
నిరామ శ్చాప్యతః ప్రోక్తో జ్వరః ప్రాయో ఽష్టమే ఽహని॥ ॥౩౨॥

రస, రక్త, మాంస, మేదో, స్థి, మజ్జా, శుక్ర, ము అని ధాతువులు ఏడు। వీటికి సంబంధించిన మలములు జ్వరప్రారంభము మొదలు క్రమక్రమముగా ఏడుదిన

ములకు పక్వమగుచున్నది. యీయేడుదినములవఱకు జ్వరము ఆమభూయిష్ఠమైయుండి యెనిమిదవనాటికి నిరామత్వమును(పరిపక్వతను)పొందును। ॥౩౨॥

శ్లో॥ సప్తాహోఽభ్యంతరే తస్మాన్న దద్యాద్భేషజం భిషక్।
దత్తం చే దామదోషేతు పునర్జనయతి జ్వరం॥ ॥౩౩॥

పూర్వోక్తప్రకారము జ్వరారంభము మొదలుకొని యేడుదినములవఱకు రసాది ధాతువులు ఆమదోషసహితములైయుండును. గాన ఆయేడురోజులలోగా జ్వరమునకు చికిత్స చేయరాదు, అట్లుచికిత్సచేయుట మానక ఆమాశయమందు ఔషధమునుయిచ్చినయెడల ఆఔషధముకూడ జీర్ణముగాక తిరిగి జ్వరమును పుట్టించును। ॥౩౩॥

ఔషధప్రయోగకాలము.

శ్లో॥ సప్తరాత్రాత్పరం కేచి న్మన్యంతే దేయ మౌషధం ।
దశరాత్రాత్పరం కేచి ద్దాతవ్య మితి నిశ్చితం॥ ॥౩౪॥

ఏడురాత్రులుగడచిన పిమ్మట ఔషధమిచ్చుట మంచిదని కొందరు, పదిరాత్రులకు పిమ్మట ఔషధమునిచ్చుట మంచిదని కొందరు నిశ్చయించుచున్నారు. ॥౩౪॥

జ్వరప్రమాదదినములు.

శ్లో॥ త్రిపంచసప్తాంకదిగీశసూర్య
స్వభూపురాణాధ్వరసంజ్ఞకాని
ప్రమాదికాఽహాని బహుజ్వరేషు
స్యు స్సన్నిపాతే ష్వధికామయేషు॥ ॥౩౫॥

బహువిధములైన జ్వరములయందును, సన్నిపాతసంబంధమైన రోగములయందును, యింకాఅనేకవిధములైన రోగములయందును. మూడు, అయిదు, ఏడు, తొమ్మిది, మొదలుపన్నెండు, పద్నాలుగు, పద్దెనిమిది, యిరవైయొకటి ఈరోజులు ప్రమాదకరములైనవి. యీరోజులలో క్రొత్తక్రొత్తవికారములు కలుగుచుండును. ॥౩౬॥

జ్వరాంతలక్షణములు.

శ్లో॥ ధాతూ న్ప్రక్షోభయ న్దోషో మోక్షకాలే తు దీపవత్॥
తతో నర శ్శ్వసన్ ఖిద్య న్కూజ న్వమతి చేష్టతే। ॥౩౭॥

దీపము తైలమంతయు హరించి ఆరిపోవుటకు సంసిద్ధముగానున్న సమయమున, భగభగలాడుచు ఆరిపోవు చందమున, జ్వరమువిడుచుటకుమునుందు, వాతాదిదోషములు

స్వాలమాకై, రసాదిధాతువుల నల్లకల్లోలముచేయును. అట్టిసమయమున రోగి. శ్వాస నధికముగావిడచును: చమటపట్టును; మూలుగును వాంతిఅగును: యింకనుఅనేకవిధములైన చేష్టలుకలిగియుండును: యీవిధముగా అకాలతనుపాకి జ్వరము పూర్తిగావిడచునటికి యీచేష్టలన్నియు తగ్గి దీపమువలె శాంతినొందును. ॥౩౬॥

శ్లో॥ దాహ స్స్వేదో భ్రమ స్తృష్ణా కంపవిడ్భేదసంజ్ఞతా।
కూజనం చాస్య వైగన్ధ్య మాకృతి ర్జ్వరమోక్షణే। ॥౩౭॥

దేహమునాశ్రయించియున్న జ్వరము విడుచుటకు ముందు, శిరస్సునందు మంట, దాహము, వణకు, మలముసరళముగా బయలువెడలుట. ఒడలు తెలియకుండుట, మూలుగుచుండుట, నోరు జ్వరవాసనకలిగియుండుట, దేహముచమటకంపుకొట్టుట యిట్టిలక్షణములుకలిగియుండును, ఇట్టిభయోత్పాతలక్షణములుకలిగినప్పుడు జ్వరము విడుచుటకు అభిముఖముగానున్నదని తెలియవలెను. ॥౩౭॥

## జ్వరిత వర్జ్యములు.

శ్లో॥ త్యజే ద్దివా స్వాపన సూపభక్ష్య
గుర్వన్న శీతోదక కందమూలాన్ ।
వ్యాయామచింతా ఽర్వాభ యేక్షణాశ్వ
స్నానవ్యవాయా న్జ్వరితః ప్రకామం ॥౩౮॥

జ్వరపీడితుడు పగటినిద్ర, పప్పు, పిండివంటలు, కఠినపదార్థములు, చల్లని (కాచని)నీళ్లు, కందమూలములు (దుంపజాతి) శ్రమపడుట, విచారము, గుర్రము మొదలైనవాహనములనెక్కుట, భయంకరములైనపనులనుచూచుట. మార్గమునడచుట. స్నానము, సంభోగము వీటిని విడువవలెను. ॥౩౮॥

## చికిత్స అవసరములేని జ్వరములు

శ్లో॥ భూతా ఽజీర్ణాభిఘాతాఖ్యా స్తత్కాలోపశమాత్మకాః ।
వైషమ్యక్రియయా వాపి జాతు శామ్యం త్యమీ స్వయం॥ ॥౩౯॥

భూతజ్వరము, అజీర్ణజ్వరము, అభిఘాతజ్వరము, మొదలైనవి చికిత్స అవసరములేకుండా వాటంతట అవియే తత్కాలముందుపశమించు స్వభావముకలవి: యివి ఒకానొకప్పుడు వైషమ్యక్రియలచే కూడా శాంతించినట్లు కనుపించును. ॥౩౯॥

## సర్వరోగసంప్రాప్తికి సామాన్యలక్షణం.

శ్లో॥ వైషమ్యాశనసంగమా ఽతపజలక్రీడా దివా స్వాపను
క్రోధాదిశ్రమ వేగవారణసురా పానక్షపా జాగరాః ।

మధ్వాద్యుష్ణఘనాతిశీతపిశితా పథ్యాదయ స్సర్వరు
గ్మూలాః ప్రోక్తవిలక్షణాః ప్రతిరుజ స్స్యుః కేచిదన్యే గుణాః ౪౦

విషమాశనము (ఎక్కువగాని, తక్కువగాని తినుట) స్త్రీసంభోగము. ఎండలో తిరుగుట, నీటిలోయీదుట లేక నానుట. పగలునిద్రించుట ఏడ్చుట, క్రోధము మొదలైనవి కలుగుట, మలమూత్రములను నిరోధించుట. కల్లుత్రాగుట, రాత్రిమేల్కొనుట. తీపి మొదలైన షడ్రసములయొక్కయు, మిక్కిలి వేడిగానున్నట్టియు, మిక్కిలిగట్టిగానున్నట్టియు, మిక్కిలిచల్లగానున్నట్టియు, ఆహారము. మాంసము, తత్త్వమునకు సరిపడనిపదార్థము, మొదలైనవి సర్వరోగములకు కారణమైయుండును. యివిగాక ప్రతిరోగమునకు ప్రధానములైన యితర గుణములుకూడా కలిగియుండును౪౦

## త్రిదోషసంప్రాప్తి

శ్లో॥ విషౌషధక్రోధపిశాచపాత
స్రావాపమానాఽధిభయాతితాపైః
వాతాదికా చ్ఛ్వాద్ధ్వ దనిలోతికోపా
త్పిత్తం చ తద్వేగవశా త్కఫోఽపి॥ ॥౪౧॥

విషము, ఔషధము, క్రోధము, పిశాచము, గర్భపాతము గర్భస్రావము అవమానము, మొదలైనవి, భయము, పీడ (బాధ) తాపము. పడుట, మొదలైనవి, వీటివల్లనుంచి వాతమున్ను యీవాత ప్రకోపమువల్ల పిత్తమున్ను పిత్తప్రకోపమువల్ల శ్లేష్మమున్ను పుట్టుచున్నది. ॥౪౧॥

## సర్వరోగసామాన్యలక్షణం.

శ్లో॥ వేగాపగ్రహశోఫకాసగురుతా వైవర్ణ్యనేత్రప్లవా
స్వాంతోత్క్ష్యప్రియతాతపానిలజలే ష్విచ్ఛా హ్యనిచ్ఛాఽరుచిః
రోమాంచశ్రమనిద్రతాఽతిశిర శ్శూలాంగజానుక్లమా
వాతే జృంభణ మక్షిదాహ మనలేఽన్నద్వేషణం శ్లేష్మణి॥౪౨॥

మల మూత్రములను నిరోధించుట, వాపు, కాస, శరీరము బరువుగానుండుట, శరీరము వివర్ణముగా (పాలిపోయిగాని కాంతి విహీనమైగాని) ఉండుటకన్నులు నీరుకారుట, మంచిమాటలను కూడవినుటకుఇష్టములేకుండుట (సంభాషణమువంద యిష్టము, మాటిమాటికి ఎండయందుగాని, గాలియందుగాని, నీటియందుగానిఇచ్ఛకలుగుట లేక అయిష్టముకలుగుట, అరుచి నగుర్పాటు, శ్రమ (బడలిక) నిద్ర, (కుంద

శొడితవము) సుఖములేకుండుట, శిరోవేదన, శరీరముపిక్కలు, వీటియందుబాధ యీలక్షణములు సామాన్యముగా సర్వరోగములయందును కలిగియుండును, వాతప్రధానరోగమం దావలింతలు, పిత్తప్రధానరోగమందు కన్నులు పకపక లాడుట శ్లేష్మప్రధానరోగమున అన్నము నందయిష్టమును కలిగియుండును. ॥౪-౫॥

## ——♦ వాతభేదములు ♦——

శ్లో॥ జిహ్వాంగస్కంధపాదస్థలనకటివసాపక్షఘాతాష్ఠజాను
త్వగ్భోగాజీర్ణసంధిభ్రమణముఖవిధూమాఽఽమగుల్మానులోమాః।
ఉన్మాదోర్ధ్వాస్థిమజ్జాక్షుతనయనదధిశృంఖలా స్నాయుగృధ్రీ
స్త్యానాగ్నైకాంగమందక్షతబధిరకలాకుక్షికార్ధాంగగుల్భాః ॥

శ్లో॥ కోష్ఠాఢ్యే జంఘనానాసిరమధుకఫరక్తోరువిస్ఫోటపార్శ్వ
శ్శుష్కోరుస్తంభఖంజాఽఽతపతిమిరధను స్సూతికామూత్రబద్ధాః।
వస్త్యంగుళ్యంగధూమాః కికసమలవిబంధౌ శిరః పంగుకర్ణా
ఖ్యక్లం కంపో విలోమ స్స్వపనగళకృశాబాహుకంపాదికా స్స్యుః ॥

(1) జిహ్వాంగవాతము, (2) స్కంధవాతము, (3) పాదవాతము, (4) స్థలవవాతము, (5) కటివాతము. (6) వసావాతము. (7) పక్షఘాతవాతము, (8) అష్ఠవాతము, (9) జానువాతము, (10) త్వగ్వాతము. (11) భోగవాతము, (12) అజీర్ణవాతము, (13) సంధివాతము, (14) భ్రమణవాతము, (15) ముఖవాతము. (16) విధూమవాతము, (17) ఆమవాతము, (18) గుల్మవాతము, (19) అనులోమవాతము, (20) ఉన్మాదవాతము, (21) ఊర్ధ్వవాతము, (ఎగురువాతము) (22) అస్థివాతము, (23) మజ్జావాతము, (24) క్షుతవాతము, (25) నయనవాతము, (26) దధివాతము (27) శృంఖలావాతము, (28) స్నాయువాతము, (29) గృధ్రీవాతము, (30) స్త్యానవాతము, (31) అగ్నివాతము, (32) ఏకాంగవాతము, (33) మందవాతము, (34) క్షతవాతము (35) బధిరవాతము, (36) కలావాతము (37) కుక్షివాతము (38) అర్ధాంగవాతము, (39) గుల్భవాతము (40) కోష్ఠవాతము (41) ఆఢ్యవాతము (42) జంఘావాతము (43) నాసావాతము (44) సిరావాతము (45) మధువాతము (46) కఫవాతము (47) రక్తవాతము (48) ఊరువాతము (49) విస్ఫోటవాతము (50) పార్శ్వవాతము (51) శుష్కవాతము (52) ఊరుస్తంభవాతము (53) ఖంజావాతము (54) ఆతపవాతము (55) తిమిరవాతము (56) ధనుర్వాతము (57) సూతికావాతము (58) మూత్రబంధవాతము (59) వస్తివాతము (60) అంగుళివాతము (61) సర్వాంగవాతము (62) ధూమవాతము (63) కికసవాతము (64) మలబంధవాతము (65) శిరోవాత

ము (66) పంగువాతము (67) కర్ణవాతము (68) శుక్లవాతము (69) కంపవాతము (70) విలోమవాతము (71) సుప్తవాతము (72) గళవాతము (73) క్షీణవాతము (74) బాహుకంపవాతము అదికణ్ణముచే (75) అణువాతము (76) పాంశువాతము (77) స్వరహీనవాతము (78) దంతవాతము (79) శాకవాతము (80) సాధ్యవాతంబు లసాధ్యంబులు. ఇట్లు వాతభేదములు 80 విధములు. ॥43॥

జిహ్వాంగవాతమున:— నాలుక వెనుకకు లాగుకొనిపోవుట, తాపము, బధిరము, జ్వరము, భ్రమ, మాటలాడకుండుట, దాహమును,

స్కంధవాతంబున:— జ్వరము, కన్నులు చీకట్లు కమ్ముట, తలతిరుగుట, మెడగుణ్ణలో నొప్పియును,

పాదవాతంబున:— కడుపు, పాదములు, మొల, తుంట్లు, గజ్జలు, గుహ్యము, కన్నులు, చెవులు, తల, వీటియందు శూల, శరీరమున సూదులు గ్రుచ్చినట్లుండుట, వణకును,

స్ఖలనవాతంబున:— శుక్లపతనానంతరము శరీరము చల్లదనము కలిగియుండుట, వణకు, శ్వాస, తాపము, మూర్ఛ, చెమట, అరిపాదములయందు నొప్పియు,

కటివాతమున:— దుష్ప్రలాపము, కటిప్రదేశమంతయు బద్దలకొట్టినట్లు లుండుట, నొప్పి, శోధము, మూర్ఛయును,

వసావాతమున:— బాధ, నిద్రలేమి, తలనొప్పి, వస, (కొవ్వు) శుష్కించుటయును,

పక్షఘాతవాతమున:— పాదాదిశిరఃపర్యంతము ఒకపార్శ్వమున శూల, శరీరమంతయు నొప్పియును,

అష్ఠవాతమున:— శరీరబరువు, పులిత్రేణుపు, అరుచి, అజీర్ణమును,

జానువాతంబున:— కలవరింతలు, గుండెలలో మంట, మోకాళ్ళు ఎండిపోవుట, నొప్పులు, వాంతి, వణుకు, మూర్ఛయును,

త్వగ్వాతంబున:— కాళ్ళు చేతులు మంటలు, పార్ష్ణిభాగము (మడమలు) యితరావయవములు పగులుటయును.

భోగవాతంబున:— శరము నొప్పులు, త్రేణుపులు, శరీరమంతయు పులుసుకంపు, మంట, వణకు, నొప్పి, వాతప్రకోపమును,

అజీర్ణవాతంబున:— అజీర్ణము, ఒళ్ళు నెప్పులు, మలబద్ధము, తలనొప్పి, కార్శ్యము, (చిక్కుట) ఆకలిలేకుండుట, ఒడలికయును,

సంధివాతంబున:— శరీరము మాటిమాటికి కరిపోడుచుట, ఒడ అంతయు పోట్లు, కలపాట్లుకీళ్ళన్నియు నొప్పులున్న,

భ్రమణవాతంబున:— ఒడలు తిరుగుట, మూర్ఛ, దాహము, వికారము, కీళ్ళు వాచుట, కార్శ్యము, గుల్మముగాని, ఉదరముగాని, గలుగుటయును

పాండువాతమున:— కళవళింతలు, భ్రమ, వాంతిరాబోవునట్లుండుట, పాండు వర్ణము, కంఠమందు చమటయును,

క్షతవాతమున:— కడుపుబ్బరము, ఒళ్లుమంట, వణుకు, కడుపులోమంట, మూత్రసంకోచమును, (బొట్లుబొట్లుగా గాని, కొంచముకొంచముగా గాని, వెడలుటయును)

బధిరవాతమున:— చెముడు, చెవులలోహోరును,

కలావాతమున:— కళ్లుఎరుపు, నాలుకనలుపు, కాంతిహీనత, పాండు వర్ణము, శరీరమంతయు పోట్లును;

కుక్షివాతమున:— కడుపులోపోటు, కళ్లు వెంగము తిరుగుట, శరీరము వాచుటయును,

అర్ధాంగవాతమున:— సగముశరీరము స్తంభించుట, నిద్రలేమి, మలబంధము కడుపులోమంటయును,

గుల్మవాతమున:— నిద్రలేమి, కళ్లుమంట తాపమును,

కోష్ఠవాతమున:— శరీరముపచ్చబడుట, చమట, మలబంధము, వికారము, అన్నమందయిష్టము, క్షీణత్వమును;

ఊర్ధ్వవాతమున:— కళ్లుముఖముతిరుగుట, కంఠము, చెవులయందు; పాదములయందు, పోట్లును;

జంఘావాతమున:— భయము, గరిపొడుచుట, అనిమిషత్వము (రెప్పపాటు లేకుండుట) కనుబొమ్మలమధ్యను, ఒళ్లంతయును, పోట్లు, మూర్ఛయును;

నాసావాతమున:— ముక్కునుండి రక్తము కారుట, దౌర్బల్యము, భయము, పిత్తప్రకోపమును;

శిరావాతమున:— నరములుపోట్లు, నీరసము, పాండిమ, లేత పచ్చని, శరీరకాంతి కలుగుటయును:

మధువాతమున:— హిక్క, పాండిమ, ముక్కునుండి రక్తముస్రవించుట దూద, దగ్గును;

కఫవాతమున:— వాపు, దగ్గు, జ్వరము, స్వరము హీనముగుట, చిక్కిపోవుట, లేతబలియుటయును;

రక్తవాతమున:— రక్తముకక్కుకొనుట, ఎక్కిళ్లు, దాహము, కాంతివిహీనతయును;

ఊరువాతమున:— తెల్లటిదేహకాంతి, తెల్లటిమూత్రము నురుగుకట్టి వెడలుట, కళ్లు వొంగముతిరుగుట, వికారమును;

విస్ఫోటవాతమున:— భ్రమ, బొబ్బలు తలత్రిప్పు, బాధయును;

పార్శ్వవాతమున:— సగముశరీరముచల్లగానుండుట, తలత్రిప్పు, ఉన్మాదము;

శుక్రవాతమునః— శుక్లము బయటబడరాక శరీరమునందే యుండుట, శిరస్సులో మంట. వికారమును:

కంపవాతమునః— చేతులు. కాళ్ళు, కణకుట, తోచకుండుట, నిద్రలేమియు

విలోమవాతమునః— ఆయాసము, నేత్రశూల, ఎక్కిళ్ళు, ఒకిరింత పాండుతయును:

సుప్తవాతమునః— చెవికొనలయందు నొప్పి, స్పర్శజ్ఞానశూన్యత, వికారము, భయము, క్రోధము, కృశత్వము, నవుటయును;

గళవాతమునః— (కంఠగతవాతమున) తాపము. వాపు, నిద్ర, కలవాళ్లు దాహము, జ్వరమును;

క్షీణవాతమునః— కృశత్వము, తల, ముక్కు. గొంతు, అవయవములు, కపాలము, కన్నులు, వీటియందు నొప్పి (లేక) పోట్లు, నిద్ర జొత్తిగా పట్టకుండుటయు;

బాహుకంపవాతమునః— ఒంటిచెయ్యి కణకుట, వికారమును;

అణువాతమునః— శరీరము ముణగలాగుకొనిపోయి గిడసబారుట, ఒళ్ళు విరుపు, నడుము వంగిపోవుట. నడచుటకు సామర్థ్యము లేకపోవుటయును;

పాంశువాతమునః— గుహ్యస్థానమందును, మేఢ్రస్థానమందును, వీర్యస్రావము, చమట, భ్రమ, మూర్ఛ, దాహము, చేతులు కాళ్లు మండుటయును;

స్వరహీనవాతమునః— స్వరము హీనమగుట, జ్వరము, కలవాళ్లు, చెవిపోటు, కృశత్వమును;

దండవాతమునః— శరీరము కర్రవలె కదలకుండుట, వాతప్రకోపము, దగ్గు పాండిమ, నిద్ర, కడుపుయందు గంధలేపన చేసినవాసన, అగ్నిమాంద్యమును;

శాకవాతమునః కాళ్లు, చేతులు, వణకు, తలత్రిప్పు, కళ్ళుగిరగిరలాడుటయు;

సాధ్యవాతమునః— గుసగుసలు బధిరము, ఒళ్ళుపోట్లు, తలత్రిప్పు, మాంద్యమును కలిగియుండును.

## పిత్తభేదములు.

శ్లో॥ సూర్యావర్తః కుసుమమధురస్వేదదుర్గంధశీతాః
క్రోధోన్మాదావమ్లమదనశిర శ్చర్మమూర్ఛా వివర్ణాః।
భ్రంశావర్ణే కరపదభుజంగే క్షుధా పుండరీకే
తృష్ణా రక్తే నిగదిత మిదం కామిలా దుష్టభావే॥ ॥౨౨॥

(1) సూర్యావర్తపైత్త్యము (2) కుసుమపైత్త్యము (3) మధురపైత్త్యము (4) స్వేదపైత్త్యము (5) దుర్గంధపైత్త్యము (6) శీతపైత్త్యము (7) క్రోధపైత్త్యము (8) ఉన్మాదపైత్త్యము (9) అమ్లపైత్త్యం (10) మదనపైత్త్యం (11) శిరఃపైత్త్యం (12) చర్మపైత్త్యం

(13) మూర్ఛాపైత్యం (14) విష్ణాపైత్యం (15) ధాతుపైత్యం (16) అన్నపైత్యం (17) శంఖావర్తపైత్యం (18) భుజంగపైత్యం (19) ఘూర్ణాపైత్యం (20) పుండరీకపైత్యం (21) తృష్ణాపైత్యం (22) రక్తపైత్యం (23) కామిలాపైత్యం (24) మహోష్ణపైత్యం అనిపైత్యములు యిరువదినాలుగు విధములు.

సూర్యావర్తపైత్యమున:— కన్నులుతిరుగుట, మూర్ఛ విదాహము;

కుసుమపైత్యమున:— నోటినుండిగాని ముక్కునుండిగాని రక్తము కక్కుకొనుట. విదాహము ఎండవేడిమి సహించు కొనలేక పోవుటయును;

మధురపైత్యమున:— అరుచి, ప్రాతఃకాలమందు కోపోద్రేకము కలుగుచుండుట, తలతిరుగుట, నోరుతియ్యగానుండుట, వాంతి. రోమాంచముము;

స్వేదపైత్యమున:— ఎక్కువగాచెమటపట్టుట, నిస్సత్తువపడలు నీరుపట్టుట యును.

దుర్గంధపైత్యము:— అంతర్దాహము (తాపము) శరీరముపైభాగమంతయు చల్లగా నుండుట. చెమట, దేహముదుర్గంధం కలిగియుండుటయును;

శీతపైత్యమున:— అరుచి, శరీరము చల్లగానుండుట,అగ్నిమాంద్యము అజీర్ణము, భ్రమ, మూర్ఛ, చెమట;

క్రోధపైత్యము:— తామసము, మర్చావనములు, క్రోధాధిక్యమును,

ఉన్మాదపైత్యమున:— విదాహము. వికారము, వాంతి, మూర్ఛ, శరీరము త్రిప్పుట, మలమూత్రములు శీఘ్రముగా వెడలుట, పిచ్చిమాటలును;

అమ్లపైత్యమున:— పుల్లగాను, చేదుగాను ఉండు త్రేన్పులు, పులుపు గలిగినవాంతి, దాహము, అరుచి, కాంతిహీనత, నాలుక, చర్మము అదురుట, అజీర్ణము, అయాసము, శరీరము పగులుట, ఒడలుబరువు, గొంతుక ఎండిపోవుట, తాపము, మోహము, ఉబ్బసము, ఓకిరింత, కళవాళ్లు, కడుపునొప్పి, తలనొప్పి, జ్వరము, చిక్కిపోవుట, గుండెలలోను కడుపులోను, మంట, చెమట, శ్లేష్మసహితమైన పుల్లని వాంతి, నోటినుండియు, ముక్కునుండియు, పుల్లని రసము వెడలుట, దురద దద్దుర్లును:

మదనపైత్యమున:— తాంబూలము పడకపోవుట, సంభోగమందభిలాష, మూర్ఛ, చెమట, తలతిరుగుటయును;

శిరఃపైత్యమున:— సర్వకాల సర్వావస్థలయందు తలతిరుగుట, నోటనీళ్లు కారుట, అరుచి, వాంతి, పులుసు పదార్థములయందయిష్టము, శరీరతాపమును;

చర్మపైత్యమున:— నాలుక, శరీరము, అరిచేతులు, అరికాళ్లు, పెదవులు మొదలైనప్రదేశములయందు చర్మముఊడుట, శరీరమంతయు అపారమైన దురదకలిగి యుండుట, నిస్సత్తువ, ఎక్కిళ్లును:

మూర్ఛాపైత్యమున:— అరుచి, నోరుతియ్యగానుండుట, నోటనీళ్లు కారుట,

తలత్రిప్పు: పొంగు గుర్బాపులును.

విదగ్ధపైత్యమున:— పనుట. కాంతివిహీనత. చప్పి, దేహము దుర్గంధముగాను యుండుట. రోమములూడిపోవుట తలత్రిప్పుటయును.

భ్రాంతిపైత్యమున:— మాటలుతడబడుట రోచకపోవుట, విచారము. రెప్పపాటులు కలుగకుండుట. గర్జనమాటలును.

అదగ్ధపైత్యమున:— ఒళ్లు నొప్పులు. తల తిరుగుట, మూర్ఛ. పనుట, దాహము. మలమూత్రములు తొందరగాను, శీఘ్రముగాను వెడలుటయును.

కరపాదపయిత్యమున:— కాళ్లు. చేతులు మండుట, దేహ కార్శ్యము, వేదనయు,

భుజంగపయిత్యమున:— దేహము పయిచర్మము పాముకుబుసమువలె నుండుట కాంతిహీనత. శిరోవాతము. అరుచి. కుష్ఠురోగమువలె ఆకారము కలుగుట, దాహమున్ను,

క్షుధాపయిత్యమున:— మిక్కిలి ఆకలి కలిగియుండుట. విదాహముభుజించిన వెంటనే అన్నము జీర్ణమై ఆకలిగానుండుట. కళ్లుపోటు ఎక్కిళ్లును,

పుండరీకపయిత్యమున:— తామరదుద్దు వంటి దద్దుర్లు, గుర్బాపుటు పురద ఉష్ణాధిక్యము దాహమును.

తృష్ణాపయిత్యమున:— ఉదయకాలమున దాహాధిక్యత రొమ్ములోను కంఠములోను మంటయును,

కామిలాపయిత్యమున:— ముఖము గోళ్లు మలమూత్రములు పచ్చగానుండుట దాహము ఆకలిలేకుండుటయును,

దుర్భాషాపయిత్యమున:— దేహముకృశించి యుండుట దేనియందు ఇష్టము లేకుంట స్వప్నమున కలవాట్లునరములు పట్టులేకుంట దుర్భాషలాడుటయును కలిగియుండును. ॥౪౪॥

## శ్లేష్మభేదములు.

శ్లో॥ కృష్ణోపజిహ్వాకఫజిహ్వాకకంఠజిహ్వా
శ్లేష్మోర్ధ్వచిప్పకదధిక్షయపిత్తజిహ్వాః
పూర్వానురక్తకఫభంగకపాండుశుక్తి
వాతక్షతౌ చ కఫకుష్ఠ ఇతి ప్రసిద్ధాః॥ ॥౪౫॥

(1) కృష్ణకాస (2) ఉపజిహ్వకాస (3) శ్లేష్మజిహ్వకాస(4) కంఠజిహ్వకాస (5) శ్లేష్మకాస (6) ఊర్ధ్వకాస (7) చిప్పకాస (8) దధికాస (9) క్షయకాస (10) పిత్తకాస (11) జిహ్వకాస (12) పూర్వకాస (13) అనుకాస (14) ర

లేకుండుటయును,

హిమకాసయందు:--- శైత్యము దగ్గు పెరుగునందువ్యాయము తలనొప్పి కృశత్వము దాహమును,

రక్తకాసయందు:--- దగ్గినప్పుడు కఫరక్తములు వుమియుట గుండెలలో పోటు కాంతిహీనత శరీరము చిక్కి కడిగానుండుట దౌర్బల్యమును.

శ్లేష్మపిత్తకాసయందు:--- నోటియందు చేదు తెమడ క్లేశంబుతో పడుట దేహము కన్నులుపచ్చగానుండుట చెవుడు గిబ్బిబిబ్బమాటలు మూర్ఛ శ్రమ అయాసమును,

పాండుకాసయందు:--- పాండువర్ణము రాత్రిభాగమందు దగ్గును,

శుష్కకాసయందు:--- అగ్నిమాంద్యము కుత్తుకయందు తెమడ ఇంద్రియములు పట్టులేకుండుటయు,

వాతకాసయందు:--- రొమ్ము కణతలు శిరస్సు కడుపు పార్శ్వములు వీటియందుశూల నోటతడిలేకుండుట ధాతువులుక్షీణించుట స్వరభేదము మాటిమాటికి పొడిదగ్గును.

క్షతకాసయందు (అధిక సంగమము, మోయజాలని బరువుమోయుట యుద్ధముచేయుట గుర్రములుమొదలైనజంతువులు పరుగెత్తునప్పుడు వాటినడ్డముదగులుట వీటిచే రొమ్మువిస్తరింపనొంది దానియందు వాతము ప్రబలమై కాసనుపుట్టించును యీదగ్గుపుట్టుటకుముందు పొడిదగ్గు రక్తముతోకూడినకఫముపడుట కంఠమునొప్పి శూలచే రొమ్ముస్ఫురింపనలవిగాకుండుట పక్క-లయందు అనిర్వాచ్యమైన వేదన శూల కీళ్ళవిసంధులు విడిపోయినట్లుండుట జ్వరము శ్వాస (అయాసము) దాహము స్వరభేదమును,

శ్లేష్మకాసయందు:--- గొంతుక శ్లేష్మపూరితము గానుండుట రాత్రింబగళ్ళు దగ్గును,

దుష్టకాసయందు:--- ఆకురుపాటు వికారాకారము అవయవముల యందు బాధ దుఃఖ పొందించుట కలిగియుండును. ॥౪౫॥

## క్రిమిరోగసంప్రాప్తి

శ్లో॥ అజీర్ణభోజీ మధురామ్లనిత్యో
ద్రవప్రియః పిష్టగుడోపభోక్తా
వ్యాయామహీనశ్చ దివా శయానో
విరుద్ధభుక్ సంలభతే క్రిమీంస్తు। ॥౪౬॥

భుజింపబడినఅన్నము జీర్ణము కాకుండ తిరిగి భోజనముచేయుట తియ్యనిపదార్థములు, పుల్లనిపదార్థములు ద్రవద్రవ్యములు చలిమిడి బెల్లము వీటినితినుట పని చే

యుండుట పాలుమాలి పగలు నిద్రపోవుట విషమాశనము వీటివలన క్రిమిరోగము పుట్టును. ॥౪౬॥

—♦ క్రిమిరోగలక్షణం ♦—

శ్లో॥ విడ్భేదశూలావిష్టంభకార్శ్యపారుష్యపాండుతాః।
రోమాంచవమిమందాగ్ని గుదకండూ ర్విమార్గతా ॥౪౭॥

క్రిమిరోగమందు మలము [illegible] శూల మలబద్ధము కృశత్వము శరీరము గరగరలాడుట తెల్లబారుట (పాండిమల) రోమాంచము వాంతులు అగ్నిమాంద్యము గుదప్రదేశమునందు దురద యిట్టిలక్షణములు కలిగియుండును. ॥౪౮॥

—♦ క్రిమిభేదములు ♦—

శ్లో॥ తిలోపమా బాహ్యమలప్రసూతా
స్తే స్థానవర్ణాః ఖలు యూకలిక్షాః
కఫాస్రవిష్టాంతరజా ద్విధా తే
రజ్వంకురాణుపృథుచిత్రవర్ణాః ॥౪౯॥

బాహ్యమలములు అనగా చెమట మొదలైనవాటివలన పుట్టినవి తిలప్రమాణముకలిగి నలుపు తెలుపురంగుకలిగి పేలుఅనియు యీళ్ళుఅనియు కఫము రక్తము మలము మూత్రము వీటియందుపుట్టినవి త్రాళ్లవలెను మొలకలవలెను చిన్నవిగాను పెద్దవిగాను అనేకరంగులుకలిగియుండును. శార్ఙ్గధరోక్తప్రకారము యీక్రిములు రెండువిధములైయున్నవి. ॥౫౦॥

—♦ సన్నిపాతసంప్రాప్తి ♦—

శ్లో॥ అపథ్యదోషా జ్జ్వరితస్య జాతు
దోషాణి దోషైః రభి సన్నిపాతాః।
దోషేషు పక్షం పరిమాణ మాహుః
కాలావధి ర్నైవ యదా కదాచిత్ ॥౫౧॥

జ్వరితునికి అపథ్యదోషమువలన ఒకానొకప్పుడు దోషములుప్రకోపించి వాటిచే సన్నిపాతజ్వరములు సంభవించును. దోషవికారములకు సామాన్యముగా పదిహేను రోజులు పరిమాణము అయియున్నది. అయినను ఒకానొకప్పుడు యీకాలపరిమాణము సరిపడకపోవచ్చును. ॥౫౨॥

## —♦ సర్వసన్నిపాతసామాన్యలక్షణం ♦—

శ్లో॥ రాత్రౌ జాగరణం దివా చ కృశతా మూర్ఛాఽతిదాహో మరు
ద్ధాన్యం స్వేదమతిప్రలాప మరతి ర్మాంద్యం చ హృత్పీడనం
కాసశ్వాసవివర్ణ శైత్యతపన శ్లేష్మోత్తమాంగవ్యథా
జిహ్వాదగ్ధకృశత్వ మంగపులకం చ స్సన్నిపాతజ్వరే॥ ॥౪౦॥

రాత్రియందు నిద్రపట్టక పోవుట పగలు బద్ధకముగానుండుట మూర్ఛ విదాహము వాతము వృద్ధిచెందుట చలి నవ్వుట, చమటపట్టుట అసందర్భముగా మాటలాడుట సుఖములేకుండుట మాంద్యము రొమ్మునొచ్చుట దగ్గు ఆయాసము రూపు మారురూపుపడుట దేహము చల్లగానుండుట జ్వరము గొంతుగనిండశ్లేష్మము శిరోవేదన నాలుక పిడచకట్టుట : యీలక్షణములు సామాన్యముగా అన్ని సన్నిపాతములలోను కలిగియుండును. ॥౪౦॥

### సన్నిపాతభేదములు

శ్లో॥ హృద్దాహచిత్తభ్రమకంఠకుబ్జ
ప్రలాపరక్తోష్ఠకభుగ్ననేత్రాః ।
శీతాంగతంద్రాంతకసన్నికాభి
న్యాసాః పరం కర్ణికజిహ్వకాఖ్యాః ॥ ॥౪౧॥

(1) హృద్దాహసన్నిపాతము, (2) చిత్తభ్రమసన్నిపాతము (3) కంఠకుబ్జసన్నిపాతము (4) ప్రలాపసన్నిపాతము (5) రక్తోష్ఠకసన్నిపాతము (6) భుగ్ననేత్రసన్నిపాతము (7) శీతాంగసన్నిపాతము (8) తాంద్రికసన్నిపాతము (9) అంతకసన్నిపాతము (10) సంధికసన్నిపాతము (11) అభిన్యాససన్నిపాతము (12) కర్ణికసన్నిపాతము (13) జిహ్వకసన్నిపాతము అని సన్నిపాతములు 13 విధములు.

హృద్దాహసన్నిపాతమున:— అధికముగా మాటలాడుట, తాపము, మోహము, గొంతుకనొప్పి, మనస్థిమితము లేకుండుట, విదాహము, పెదవు లెండుట, దగ్గు, మాంద్యము, వణకు, కలవాట్లు, కంఠము, అలాటము, వీటియందు చమటయును,

చిత్తవిభ్రమసన్నిపాతమున:— శరీరము తయు పట్లు సడలినట్లుండుట, వాతపిత్తములు ప్రకోపమును చెందుట, స్థిమితము లేకుండుట, స్మృతితప్పుట, కనుబొమ్మలు ముడుచుకొనుట, పాడుట, ఆడుట, కలవరించుటలును,

కంఠకుబ్జసన్నిపాతమున:— విదాహము, తల తిరుగుట, (తలవిసురు) మెడ కుదియబడుట, విస్తారముగా మాటలాడుట, తాపము, మూర్ఛ, అవయవములు పట్లు లేకుండుట, వణుకు, వాంతి, ఎక్కిళ్ళు, గద్గదస్వరముతో మాట్లాడుట, శిరోవేదనయున్ను,

ప్రలాపసన్నిపాతమున:— శ్లేష్మము: అతిసంభాషణ, తాపము, వాతశ్లేష్మ ప్రకోపము. ఎక్కిళ్ళు. జ్వరమును.

రక్తోష్ఠసన్నిపాతమున:— నాలుక, పెదవులుపగిలి రక్తము కారుట. దగ్గు, వణకు, తలతిరుగుట, నాలుకనలుపెక్కి మచ్చకలిగియును:

భుగ్ననేత్రసన్నిపాతమున:— కన్నులు ఊడిపడిపోవునట్లుండుట. నీళ్ళు కారుట, చూపు కనబడకుండుట. అతిభాషణము. వణుకు, భ్రమయు:

శీతాంగసన్నిపాతమున:— దేహము చల్లగానుండుట, దగ్గు, ఆయాసము, ఎక్కిళ్ళు, ఏకీలును పట్టులేకుండుట. వాంతి, తాపము, మూర్ఛ, విరోచనము, వణుకుటయును;

అంతకసన్నిపాతమున:— దాహము, మోహము, తలవణకు, కలవరింతలు, వాంతి, ఎక్కిళ్ళు, జ్వరమును;

సంధికసన్నిపాతమున:— శరీరము మహాప్రకోపముగానొప్పియుండుట, కీళ్ళ శరీరము వాచుట, వాతము, బాధ, దగ్గు. సోమరితనము, తాపమును;

అభిన్యాససన్నిపాతమున:— త్రిదోషములును ఏకీభవించియుండుట. జ్వరము ఆయాసము, ముఖము జిడ్డుగానుండుట, అమితమైననిద్ర, కాంతిహీనత, తాపము, నిస్సత్తువ, దాహము, ఉమ్ముటయు;

కర్ణకసన్నిపాతమున:— అతిభాషణము, నాలుక బీటలుతీయుట, ఎక్కిళ్లు దగ్గు. వణకు, చెవికొనలయందువాపు, తాపమును:

జిహ్వకసన్నిపాతమున:— నిట్టూర్పు తొందరగావిడుచుట, తాపము, దగ్గు నాలుకకఠినమై ముండ్లుకలిగియుండుట, మాటలుడిగిపోవుట, చెముడు, మాంద్యము, ఇట్టిలక్షణములు కలిగియుండును. ॥౫౧॥

## —♦ కర్ణికలక్షణం ♦—

శ్లో॥ జ్వరస్య పూర్వం జరమధ్యకాలే
జ్వరాంతిమేవా శ్రుతిమూలశోధః।
క్రమా దసాధ్యః ఖలు కష్టసాధ్య
స్సుఖేన సాధ్యో మునిభిః ప్రదిష్టః।

సన్నిపాతసంబంధమైనజ్వరములలో చెవులకింద వాపుకలుగును. ఇది కొంతమందికి ఒకచెవికిందనుమాత్రమేకలుగును. కొంతమందికిరెండుచెవులకిందనుకలుగును దీనివలన కొంతమంది జీవించకపోవుటగూడ కలదు. యీవాపు జ్వరమునకు మొదటనేఉన్నయెడల అసాధ్యమనియు, మధ్యకలిగినయెడల కష్టసాధ్యమనియు, ఆఖరున కలిగినయెడల సులభసాధ్యమనియు, తెలుసుకొనవలెను. ॥౫౨॥

## సన్నిపాతదినప్రమాణం

శ్లో॥ సశాఖాద్యరే సన్నిమనూధికష్టౌ
పక్షం చ తత్త్వం చ దిగబ్ధిపక్షాః।
మాసత్రియం షోడశవాసరాణి
యదా కదాచి న్మనితాంద్రికే స్యాత్॥ ॥౫౩॥

హృద్దాహసన్నిపాతమునకు (20) చిత్తభ్రమసన్నిపాతమునకు, (21) కంఠకుబ్జ సన్నిపాతమునకు, (13) ప్రలాపసన్నిపాతమునకు, (14) రక్తోష్ఠసన్నిపాతమునకు, 10 భుగ్ననేత్రసన్నిపాతమునకు (8) శీతాంగసన్నిపాతమునకు, (15) తాంద్రికసన్నిపాతమునకు,(25) అంతకసన్నిపాతమునకు,(10) సంధికసన్నిపాతమునకు(7)అభిన్యాససన్నిపాతమునకు, (15) కర్ణికసన్నిపాతమునకు,(90) జిహ్వకసన్నిపాతమునకు,(16) తాంద్రికసన్నిపాతమునకు ఒక్కొక్కప్పుడు, (7)పరిమాణదినములుఅయియున్నవి,

### సాధ్యసన్నిపాతనామములు.

శ్లో॥ స్యుస్తాంద్రిక సన్నికకర్ణికే చ
ప్రలాపచిత్తభ్రమజిహ్వకాఖ్యాః
షట్సన్నికావాతకఫ ప్రధానా
స్సాధ్యా స్స్యు రేతా స్సుచికిత్సకస్య॥ ॥౫౪॥

ఇదివరలో చెప్పబడిన పదమూడు సన్నిపాతములలోను, (1) తాంద్రికసన్నిపాతము (2) సంధికసన్నిపాతము (3) కర్ణికసన్నిపాతము (4) ప్రలాపసన్నిపాతము (5)చిత్తభ్రమసన్నిపాతము (6) జిహ్వకసన్నిపాతము అను ఆరున్ను శ్లేష్మవాతప్రధానములు యివి చికిత్సకుసాధ్యములు. ॥౫౪॥

### అసాధ్యసన్నిపాతములు.

శ్లో॥ హృద్దాహరక్తోష్ఠకకంఠకుబ్జా
భిన్యాసశీతాంతకభుగ్ననేత్రాః
పిత్తాధికాదాహవిరేకయుక్తా
స్సువైద్యకస్యాపి భవం త్యసాధ్యాః॥ ॥౫౫॥

(1) హృద్దాహసన్నిపాతము (2) రక్తోష్ఠకసన్నిపాతము (3) కంఠకుబ్జసన్నిపాతము (4) అభిన్యాససన్నిపాతము (5) శీతాంగసన్నిపాతము (6) అంతకసన్ని

పాతము (7) భగ్ననేత్రసన్నిపాతము. అనునీదున్ను పిత్తప్రధానములు. యివిచికిత్స కుసాధ్యములు కావు. ॥౪౩॥

## హృద్రోగసంప్రాప్తి

శ్లో॥ అత్యుష్ణగుర్వమ్లకషాయతిక్త
శ్రమాభిఘాతాఽధ్యయనప్రసంగైః
స్త్రీసంగమాద్వేగనిరోధనేన
హృదామయః పంచవిధః ప్రదిష్టః ॥౪౪॥

మిక్కిలి వేడిచేయునట్టియు, అజీర్ణములైనట్టియు, పులుపు, వగరు, చేదు కలిగిన పదార్థములు, పరిశ్రమ, అభిఘాతము, మితిమీరి చదువుట, ఎక్కువగా మాట్లాడుట, సంభోగము, మలమూత్రనిరోధనము, వీటిచే హృద్రోగము జనించును. యీహృద్రోగ మూఅయిదువిధములు. ॥౪౫॥

## హృద్రోగలక్షణము

శ్లో॥ వాతే హృది స్ఫోటనపీడనాని
పిత్తే తృషుష్మాఽస్యవిశోషధూమాః
కఫేఽగ్నిమాంద్యారుచిహృద్గురుత్వం
స్యాత్సన్నిపాతక్రిమిసర్వలింగం ॥౪౬॥

వాతసంబంధమైన హృద్రోగమందు:— హృదయమునందు అంపముతో కొట్టినట్లుబాధ, గుండెలు లాగుటయు;

పిత్తసంబంధమైన హృద్రోగమందు:— దాహము, శరీరమునకు వేడిమి, నోరెండుట, గొంతుకలోపొగవచ్చినట్లుండుటయును;

కఫసంబంధమైనహృద్రోగమందు:— అగ్నిమాంద్యము, అరుచి, గుండెలలో బరువును;

సన్నిపాతదోషము వల్లనున్ను క్రిమివల్లనున్ను సంబంధించిన హృద్రోగములయందు వాతాదులకు వేరువేరుగాచెప్పబడిన లక్షణములను కలిగియుండును. హృద్రోగము గుల్మరోగమువలె హృదయమందుపుట్టును. ॥౪౭॥

## ఆమదోషప్రాప్తి.

శ్లో॥ యద్వై వాపక్వం దోషాణాం మలానాం చ రసాదిషు।
త మేవాఽమస్య సంప్రాప్తిం విజానీయా త్సదా భిషక్॥ ॥౪౮॥

రస, రక్త, మాంస, మేధోఽస్థి, మజ్జా, శుక్రములను, సప్తధాతువులను ఆశ్రయించియున్న వాతాదిదోషములున్ను, మలములున్ను, యెప్పుడు పక్వములు గావో, అదియే ఆమదోషసంప్రాప్తి అని సర్వరోగములయందు తెలియవలెను ॥౫౮॥

## ఆమదోషలక్షణం.

శ్లో॥ ఆలస్యతంద్రాహృదయాఽవిశుద్ధి
ర్దోషాఽప్రవృత్త్యాఽకులమూలభావైః
గురూదరత్వాఽరుచిసుప్తతాఽభి
రామాన్వితం వ్యాధి ముదాహరంతి॥ ॥౫౯॥

ఆలస్యము, బద్ధకము, హృదయము పరిశుద్ధము గానుండుట, గాత్రి కాలమున విరేచనములు, మనోవ్యాకులత, మూలోపద్రవములు, కడుపుబరువు. అరుచి, నిద్రయివిఅను (అపక్వ) దోషలక్షణములు. ॥౫౯॥

## శూలరోగసంప్రాప్తి

శ్లో॥ ఆరోహణాఽయాసపరిశ్రమాద్యై
ర్గుర్వన్నరూక్షోదకపానసంగైః
కోపోష్ణదాహాఽగ్రహహాస్యనృత్యై
స్త్రిదోషసన్యామజ మష్టభేదం॥ ॥౬౦॥

గుర్రములు మొదలైనవాటిపై సవారిచేయుట, తనశక్తికిమించిన ఆయాసపడుట పరిశ్రమచేయుట, మొదలైనవి కఠినపదార్థములు తినుట, మురికినీరు త్రాగుట, సంభోగము ఉప్పుతినుట, మిక్కిలి వేడిగానున్న నీరు త్రాగుట, కోపము, నవ్వుట, నృత్యము చేయుట, వీటివలన శూలరోగము జనించును. యీశూలరోగము వాత, పిత్త, శ్లేష్మ శ్లేష్మపిత్త, శ్లేష్మవాత, శీతపైత్య, సన్నిపాత, ఆమ, భేదములచే ఎనిమిదివిధంబులై యుండును. ॥౬౦॥

## శూలరోగ సామాన్యలక్షణం

శ్లో॥ శంఖుస్ఫోటనవ త్తస్య యస్మా త్తీవ్రాఽతివేదనా।
శూలాసక్తస్య భవతి తస్మా చ్ఛూలేతి కథ్యతే॥ ॥౬౧॥

ఇనపమేకుదిగగొట్టినట్లు తీవ్రమైన బాధకలిగియుండుటవలన, ఇది శూలవ్యాధి అని చెప్పబడుచున్నది. ॥౬౧॥

(1) మూత్రకృచ్ఛ్ర, (2) మూత్రాఘాత,
(3) మూత్రాశ్మరీరోగసంప్రాప్తి }

శ్లో॥ పృథఙ్మలాః స్వైః కుపితా నిదానైః
సర్వేఽథవా కోప ముపేత్య వస్తౌ।
మూత్రస్య మార్గం పరిపీడయంతి
యదా తదా మూత్రయతీహ కృచ్ఛ్రాత్॥ ॥౬౧॥

వాత, పిత్త, శ్లేష్మములు, ప్రత్యేక ప్రత్యేకముగా గాని, అన్నియు కలిసియు గాని, ప్రకోపమును పొంది వస్తియందు (పొత్తికడుపునందు) చేరి మూత్రమునడ్డగించును. ఇట్టిసమయమున మిక్కిలికష్టముచే మూత్రము బయలువెడలును. ॥౬౧॥

శ్లో॥ ద్రుతాఽధ్వలంఘనాయాసై రభిఘాతా త్ప్రపీడనాత్।
స్వస్థానా ద్వస్తి రుద్వృత్త స్స్థూల స్తిష్ఠతి గర్భవత్ ॥౬౨॥

తొందరగా త్రోవనడచినను, కాలువలు మొదలైనవాటిని దాటినను, శక్తికి తగని ఆయాసపడినను, వస్తిప్రదేశమునందభిఘాతము (దెబ్బ) తగిలినను, వస్తిప్రదేశమును (పొత్తికడుపును) పిసికినను, మూత్రపిండము స్వస్థానమునుండి కదలి గర్భమువలె స్థూలముగా పెరుగును.

మూత్రకృచ్ఛ్రమునకును, మూత్రాఘాతమునకును, స్వల్పమైన తారతమ్యము కలిగియుండును. మూత్రకృచ్ఛ్రమున మూత్రబంధము స్వల్పము, బాధలు అధికముగాను, కలిగియుండును. మూత్రాఘాతమున బాధలు స్వల్పము, మూత్రబంధము అధికముగాను కలిగియుండును. మలమూత్రాదులయొక్క వేగమును అడ్డుపరచుటచే వాత, పిత్త, కఫములు, ప్రకోపమును జెంది మూత్రాఘాతము కలుగుచున్నది. మూత్రాశ్మరియందు శ్లేష్మము ముఖ్యముగా రాజైయుండును. త్రిదోషములలో వాతము ప్రకోపించి వస్తియందుండు మూత్రపిండమునందుచేరి వస్తిద్వారమునడ్డగించి శుక్రముతోకూడినమూత్రమును గాని, ద్రవస్వరూపమైన పిత్తముతోకూడిన మూత్రమును గాని, కఫముతోకూడిన మూత్రమును గాని, కేవల మూత్రమును గాని, శోషింపజేయును. అట్లు శోషింపబడినమూత్రమునందు గోవుయొక్క పిత్తమున గోరోచనము వలె కఠినమైె రాతివంటి గడ్డబయలుదేరును. ఇదే మూత్రాశ్మరి అనబడును.

(1) వాతజము, (2) పిత్తజము, (3) శ్లేష్మజము, (4) సన్నిపాతజము, (5) శల్యజము, (6) పురీషజము, (7) అశ్మరీజము, (8) శుక్రజము, అని మూత్రకృచ్ఛ్రము లెనిమిదివిధములు.

(1) మూత్రగ్రంధి, (2) మూత్రోత్సంగము, (3) మూత్రజము, (4)మూత్ర

వాదము (5) మూత్రశుక్రము (6) మూత్రధర (7) మూత్రాతీతము (8) మూత్రక్షయము (9) అష్ఠీల (10) విడ్విఘాతము (11) ఉష్ణవాతము (12) బస్తికుండలి (13) వాతబస్తి (14) వాతకుండలి అని మూత్రాఘాతము పద్నా నుగువిధములు (1) వాతజము (2) పిత్తజము (3) శ్లేష్మజము (4) శ్లేష్మపైత్యజము (5) శ్లేష్మవాతజము (6) శీతపైత్యజము (7) శర్కరాశ్మరి (8) బాలాశరి (9) శుక్రాశ్మరి అదిమూత్రాశ్మరి తొమ్మిదివిధములు. అయినప్పటికిన్ని యీమూడువిధములైన మూత్రవ్యాధులు మూత్రమునకే సంబంధించిన వగుటచేతను పోల్చ శక్యము కానిదగుటచేతను. విశేషించిప్రత్యేక లక్షణములతో వివరించి వ్రాయలేదు ||౬౩||

## శోఫరోగసంప్రాప్తి

శ్లో॥ క్షుద్వ్యాధియోపవాస భోజనకర్శనాద్యైః
క్షారామ్లతీక్ష్ణోష్ణగురూపసేవాత్।
దధ్యామమృచ్ఛాకవిరోధిదుష్ట
గరోపసృష్టాన్ననిషేవణేన॥ ||౬౪||

వమనవిరేచనాదులచే శరీరమును ఎక్కువగాశోధించినను, రోగముచేతను ఉపవాసాదుల నధికముగాచేయుటచేతను, శరీరబలము కృశించిపోవుటచేతను ఉప్పు పులుసు, తీక్ష్ణములైనవి (అలస్యముగా అరుగునవి) వేడిచేయువవి, అగుపదార్థములను మితిమీరి భుజించుటచేతను, పెరుగు, పచ్చిడి, (పక్వములు కానివి) మట్టి, ఆకుకూరలు పరస్పరవిరుద్ధములగు, (క్షీరదధ్యాదులు) పదార్థములు, దుష్టజంతువులయొక్కయు విషమురొక్కయు, స్పర్శకలిగినపదార్థములు వీటిని సేవించుటచే శోఫ, (వాపు) రోగము జనించును. ||౬౪||

## శోఫరోగసామాన్యలక్షణం

శ్లో॥ సగౌరవం స్యాదనవస్థితత్వం
సోత్సేధమూష్మాఽథసిరా తనుత్వం।
స లోమహర్షశ్చ వివర్ణతాపి
సామాన్యలింగం శ్వయథోః ప్రణీతం॥ ||౬౫||

వాపు నిలకడగా ఒకచోటనేఉండక వాచుచుండుట, వేడికల్గుట, సిరలు సన్నగిలియుండుట. వెంట్రుకలు గరిపొడుచుకొనియుండుట, వాపుకలచోటున దేహకాంతి మారియుండుట, ఇవి శోఫరోగమునకు సామాన్యలక్షణములు. ||౬౫||

శ్లో॥ యస్తు పాదాభినిర్వృత్తశ్శోధ స్సర్వాంగగో భవేత్।
పురుషం హంతి నారీంచ ముఖజో గుహ్యజో ద్వయం॥ ॥౬౭॥

క్రిందినుంచి మీదుగా వ్యాపించువాపు పురుషులను, పైనుండి క్రిందుగా వ్యాపించువాపు స్త్రీలను, గుహ్యస్థలమున వ్యాపించినవాపు స్త్రీపురుషులను చంపును.

శ్లో॥ శ్వాసః పిపాసా దౌర్బల్యం జ్వర శ్ఛర్ది రరోచకః।
హిక్కాతిసారకాసాశ్చ శోధినం క్షపయం త్యమీ॥ ॥౬౮॥

శ్వాస, దాహము, నీరసము, జ్వరము వాంతి. అరోచకము, ఎక్కిళ్ళు, అతిసారము, దగ్గు, యీలక్షణములుగల శోధరోగము రోగులను హింసించును. ॥౬౮॥

## —♦ హిక్కారోగసంప్రాప్తి ♦—

శ్లో॥ శాలూక పిష్టాన్న విదాహి తైల
పిణ్యాకదధ్యాది నిషేవణేన।
స్రోతస్సు సంజ్ఞావహనేషు వాయుః
ప్రకుప్య హిక్కాం జనయే త్ప్రకామం॥ ॥౬౯॥

కందమూలములు, పిండికంటలు, విదాహమునుకలుగజేయుపదార్థములు, నువ్వులనూనె, తెలకపిండి, పెరుగుమొదలైన పదార్థములను సేవించుటచే వాతము ప్రకోపించి ప్రాణవహస్రోతస్సులయందు వ్యాపించి హిక్కను పుట్టించును. ॥౬౯॥

## —♦ హిక్కాభేదములు ♦—

శ్లో॥ క్షుద్రాన్నగంభీరమహాయుగాఖ్యై
ర్హిక్కామయః పంచవిధః ప్రణీతః॥ ॥౭౦॥

క్షుద్రహిక్క, అన్నజహిక్క, గంభీరహిక్క, మహాహిక్క, యమళహిక్క అని హిక్కారోగము అయిదువిధములు,

క్షుద్రజహిక్క:— గొంతుకయందుపుట్టి చాలా కాలము వేగమునువహించి ఆయాసపడినప్పుడు అధికమై ఆహారమును సేవించినపిమ్మట ఉపశమించును.

అన్నజహిక్క:— అమితభోజనమువల్ల జనించును. ఉదకపానముచే ఉపశమించును.

గంభీరహిక్క:— బొడ్డుదగ్గరనుండి మిక్కిలి వేగముతో తీవ్రమైన ధ్వనికలిగి బయలుదేరును. ఇది ఒకానొకప్పుడు పక్వాశయమునుండికూడా బయలు

డేయును. దీనియందు కణుకు, ప్రజ్ఞానాశము, శోష్ఫల్యము, ఉచ్ఛ్వాసావరోధము కలిగియుండును.

మహాహిక్క:— తీవ్రమైన వేగముకలిగి ప్రజ్ఞాభ్రమైనశబ్దముతో బయలువెడలును మరియు, కనుబొమ్మలు సడలుట, కణతలు స్తంభించుట, కన్నులవెంబడి నీరుకారుట, కలిగియుండును. ఇది ఒక్కొక్కటిగాగాని రెండేసిగాని, మూడేసిగాని, అనేక రకములుగాని, రావచ్చును యమళహిక్కకంటె యిది మిక్కిలి భయంకరమైనది.

యమళహిక్క:— (వ్యపేతహిక్క) రెండేసిచొప్పున బయలుదేరి చాలా కాలమువరకు ఉండును. ఆహారము జీర్ణమగుసమయమున పుట్టిన యమళహిక్కనే వ్యపేతహిక్కయందురు. ॥౭౦॥

## —♦ అజీర్ణరోగసంప్రాప్తి ♦—

శ్లో॥ ఈర్ష్యాభయక్రోధపరిక్షతేన
లుబ్ధేన శుగ్దైన్యనిపీడితేన।
ప్రద్వేషయుక్తేన చ సేవ్యమాన
మన్నం న సమ్యక్పరిపాక మేతి। ॥౭౧॥

ఇతరుల ఔన్నత్యమును సహింపలేకపోవుట, భయపడుట, పొందశక్యము కానిదానిపయిని కోరికకలుగుట, కోపము, రోగము, దరిద్రము, లేక దీనత్వము, ద్వేషము, వీటితో భుజించినఆహారము జీర్ణము కాదు. అగ్నిమాంద్య, అలసక, విలంబిక విషూచి, ఛర్ది, అరోచకములు, అజీర్ణభేదములు. ॥౭౧॥

శ్లో॥ అనాత్మవంతః పశువ ద్భుంజతే యేఽప్రమాణతః।
రోగానీకస్య తే మూలం అజీర్ణం ప్రాప్నువంతి తే॥ ॥౭౨॥

ఏమానవులు తమతమశరీరస్థితినిన్ని, అగ్నిబలమునున్ను, తెలుసుకొనక పశు ప్రాయులవలె మితిమీరి భుజించెదరో అట్టివారు రోగసమూహమునకు కారణమైన అజీర్ణ రోగమునకు గురియగుచున్నారు. ॥౭౨॥

## —♦ జఠరాగ్నిభేదములు ♦—

శ్లో॥ మంద స్తీక్ష్ణోఽథ విషమ స్సమశ్చేతి చతుర్విధః।
కఫపిత్తానిలాధిక్యా త్తత్సామ్యా జ్జాఠరోఽనలః॥ ॥౭౩॥

జఠరాగ్ని భుజింపబడినఆహారమును జీర్ణముచేయును. ఈజఠరాగ్ని మందము, తీక్ష్ణము, విషమము, సమము, అని నాలుగువిధములు. ఎట్లన శరీరముందుండు వాత,

పిత్త, కఫములలో శ్లేష్మము స్వప్రమాణముకంటె అధికముగానున్నయెడల కాయాగ్ని (దేహమందుండు జఠరాగ్ని) మందగించును. గాన ఇది మందాగ్నియగును. పిత్తము అధికముగానున్నయెడల (తీక్ష్ణగుణ అగ్నియగుటచే) కాయాగ్ని మరింత వృద్ధియగును. గాన ఇది తీక్ష్ణాగ్నియగును. వాతము అధికముగానున్నయెడల ఆవాతముచే జఠరాగ్ని (కాయాగ్ని) విషమగతిని పొందును. గాన ఇది విషమాగ్నియగును. వాత పిత్త, కఫములు మూడున్ను వృద్ధిక్షయములులేక స్వపరిమాణముననుసరించి ఉన్నయెడల జఠరాగ్ని సమానస్థితియందుండును. గాన ఇది సమాగ్నియగును. ॥23॥

## అజీర్ణభేదములు.

శ్లో॥ ఆమం విదగ్ధ విష్టబ్ధం కఫాగ్న్యనిలసంభవం।
అజీర్ణం కేచి దిచ్ఛంతి చతుర్థం రసశేషతః॥ ॥24॥

కఫప్రకోపముచే జఠరాగ్నిని మందగింపచేసి ఆహారమును జీర్ణముకానీయక, యుండునది ఆమాజీర్ణమనియు, పిత్త ప్రకోపముచే, జఠరాగ్నిని ప్రజ్వలింపజేసి ఆహారమును జీర్ణముకానీయక యుండునది విదగ్ధాజీర్ణమనియు, వాతప్రకోపముచే జఠరాగ్నిని విషమముగచేసి మలబంధమును కలుగజేయునది విష్టబ్ధాజీర్ణమనియు, భుజింపబడిన అన్నముయొక్క సారముఅయిన రసమును జీర్ణముకానీయకుండునది రసశేషాజీర్ణమనియు తెలియవలెను.

ఆమాజీర్ణమున:— భుజింపబడిన అన్నాదికము రసధాతువుగామారక త్రియ్యటి తేణుపులు, శరీరము బరువు నోటివెంటనీరు, చెక్కిళ్లువాపున్ను;

విదగ్ధాజీర్ణమున:— దప్పిక, మూర్ఛ, దప్పి, పైత్యాధిక్యము ఒడలుతిరుగుటయును;

విష్టబ్ధాజీర్ణమున:— వాతసంబంధమైన వికారములు, మలమూత్రనిరోధము శరీరమునస్తంభించుట, మూర్ఛ, కడుపులోగుడగుడలాడుట, కడుపులోనొప్పియును:

రసశేషాజీర్ణమున:— అన్నద్వేషము, ఒడలుబరువు, గుండెలలోబరువును కలిగియుండును. అగ్నిమాంద్య, ఛర్ది, అరోచకములు స్పష్టములు, కడుపుబ్బరముకలిగి దాహముడంగక సహింపరానిబాధకలిగి తీవ్రమైన తేణుపులుగలది 'అలసక' అనియు, భుజింపబడిన ఆహారము జీర్ణముగాక ఛర్దనరూపమునగాని, విరేచనరూపమునగాని వెలువెడలక ఆమాశయమందే నిలిచియుండునది 'విలంబక' అనియు, మూడుదోషములు తోగుచ్చినసిథమున దేహమంతయు బాధకలిగియున్న అజీర్ణము 'విషూచి' అనియు తెలియవలయును. ॥24

## గుల్మరోగసంప్రాప్తి

శ్లో॥ దుష్టవాతాదయోత్యర్థం మిథ్యాహారవిహారతః।
కుర్వంతి పంచధా గుల్మం కోష్ఠాంతర్గ్రంథిరూపిణమ్॥ ॥25.

## ఉదరరోగలక్షణములు

శ్లో. ఆధ్మానదౌర్బల్యవిదాహతంద్రా
శోథాగ్నిమాంద్యకృశవేగరోధాః।
గతావశక్తిర్జఠరామయేషు
భవంతి దోషేషు బలాధికేషు। ॥౭౮॥

పయిన చెప్పినప్రకారము దోషములు వృద్ధిపొంది నప్పుడు, కడుపుబ్బరము, బలహీనము, దాహము, (తాపము) మైకము, వాపు, అగ్నిమాంద్యము, శరీరము కృశించుట, మలమూత్రనిరోధము, నడుముశక్తిలేకుండుట, అన్నివిధములైన ఉదరవ్యాధులయందు ఉండును. ॥౭౯॥

## —♦ ఉదరరోగభేదములు ♦—

శ్లో. త్రిదోషైస్సన్నిపాతేన ప్లీహాబద్ధక్షతోదకైః।
అష్టధేత్యుదరవ్యాధిర్విజ్ఞేయస్సర్వవైద్యకైః ॥౮౦॥

వాత, పిత్త, కఫ భేదములచే ప్రత్యేక ప్రత్యేకముగాను, సన్నిపాతము చేతను ప్లీహవృద్ధిచేతను, ప్లీహవృద్ధిపొందుటచేతను, బద్ధగుదోదరము క్షతోదరము జలోదరము, అను భేదములచేతను యెనిమిదివిధములు. అని తెలియవలయును.

వాతోదరమున:— కడుపు తోలుతిత్తివలెబిగిసి నల్లనినరములతో నిండియుండుట, సూదుంగుచ్చినట్లు, కడుపులోను, ఇరుప్రక్కలయందును, బాధ, మీగాళ్ళు మోచేతులు, నాభి, పీటియందు వాపు, కీళ్లనొప్పి, మలబంధమును,

పిత్తోదరమున:— కడుపు పచ్చని, లేక ఎఱ్ఱనిరంగుగల నరములతో నిండియుండుట, జ్వరము, తాపము, మూర్ఛ, దాహము, భ్రమ, అతిసారము. నోరు చేదుగానుండుటయును,

శ్లేష్మోదరమున:— కడుపునీటితోడవలె మొద్దుబారి. తెల్లటినరములతో నిండియుండుట, దేహకార్శ్యము స్పర్శజ్ఞానము లేకుండుట, వాపు, గురుత్వము, నిద్ర, వాంతిరాబోవునట్లుండుట, అరుచి, ఆయాసము, దగ్గు, శరీరము తెల్లబారుటయును,

సన్నిపాతోదరమున:— (దూష్యోదరమున) వాతాదులకు వేరువేరుగా చెప్పినలక్షణములుకలిగియుండుట, శీతకాల, వర్షాకాలములయందును, దుర్దినములయందును, (సూర్యదర్శనము కాక, మేఘములతో ఆకాశము నిండియున్నదినములందును, ప్రకోపించుట, తాపము, మూర్ఛ, దేహకార్శ్యము, నోటతడిలేకుండుట, ఇట్టి లక్షణములుకలిగియుండును. విషమిశ్రితములైన అన్నపానాదుల సేవించుటచే రక్తము చెడి దానివలన పుట్టుటచే దూష్యోదరమని చెప్పబడుచున్నది.

ప్లీహోదరమున:— తాపమును, ద్రవమును పుట్టించు పదార్థములను అమితముగా సేవించుటచే రక్తశ్లేష్మములు పాడై ప్లీహముగాని, యకృత్ గాని, వృద్ధినొందుటచే జనించును. యిది త్రిదోషలక్షణములు కలిగియుండును.

బద్ధగుదోదరము:— వెంట్రుకలు మొదలయినవికల అన్నాదికము, జిగురుగల పదార్థములు వీటిని భుజించుటచే పేగులయందలి రంధ్రములు మూసుకొనిపోయి మలములు సంచితములై హృదయమునకును, బొడ్డునకును, మధ్యభాగమున జనించును

క్షతోదరము:— పేగులయందు గుండ్రమైన ముల్లు కలుగుటచే ఆ ఛిద్రరంధ్రముల నుండి నీరు స్రవించి గుదస్థానమునుంచి బయలువెడలును. యిట్టితరి హెచ్చినప్పుడ ఉదరము జనించును. యిదియు త్రిదోషలక్షణములనే కలిగియుండును.

జలోదరము:— పొటకరించిన (బుడగలతో ఆకారము ధరించిన) బొజ్జ కదలినప్పుడు కడుపులో బొళబొళమను శబ్దము, క్లోమస్థానమున (యకృత్ స్థానమున) జలాధిక్యము కలిగియుండుట, దాహము, కడుపుమీద అనేకములైన నరములు వ్యాపించియుండుట, యిట్టిలక్షణములు కలిగి త్రిదోషలక్షణముల ధరించియుండునని తెలియవలయును. ॥౧౯॥

— సాధ్యాఽసాధ్యోదరనిర్ణయము —

శ్లో॥ సర్వేఽప్యసాధ్యా ఉదరామయాస్స్యుః
ప్రాయస్స్వభావేన తథాఽపి జాతః।
బలాన్వితస్యాభినవోత్థితం య
త్ప్రయత్నసాధ్యం విజలం యది స్యాత్॥ ॥౨౦॥

యిదివరలో చెప్పబడిన సర్వవిధములయిన ఉదరవ్యాధులున్ను, స్వభావముగానే చికిత్సకు శక్యముకానివైయుండును. ఆయినప్పటికిన్ని బలాఢ్యునకు నవీనముగా బయలుదేరి జలములేనియెడల ఒకానొకప్పుడు తగినచికిత్సచే సాధ్యము కావచ్చును. ॥౨౦॥

— కాసరోగసంప్రాప్తి —

శ్లో॥ రసస్య ధూమస్య నిరోధనేన
దుష్టాన్నభుక్త్యాఽతిపరిశ్రమేణ।
విమార్గయానా దసితస్య వేగ
క్షుతావరోధేన చ కాసరోగః॥ ॥౨౧॥

శరీరమునగల ఆమరసము, శరీరాంతర్గతమైన వాతముచే పొగను నోటితో

గాని, మత్స్యముతో గాని, ఊర్ధ్వముఖము గాంచిపడుట, అతికష్టపుట, విరుద్ధాన్నభక్షణము, శక్తికిమించి ఆయాసపడుట, భుజించునప్పు డాహారము యితరమార్గమున పోవుట, మలము, మూత్రము, తుమ్ము వీటిని ఆపుకొనుట, వీటివలన కాసరోగము జనించును.

## — ♦ కాసరోగభేదములు ♦ —

శ్లో॥ పంచకాసా స్మృతా వాతపిత్తశ్లేష్మక్షతక్షయైః।
క్షయాయోపేక్షితా స్సర్వే బలినశ్చోత్తరోత్తరం॥ ॥౮౨॥

వాతము, పిత్తము, శ్లేష్మము, క్షతము, క్షయ, వీటిచే కాసరోగము, (దగ్గురోగము) జనించును. యివి ఒకదానికంటె ఒకటి ఉత్తరోత్తరముగా ప్రబలములు, వీటిని యుక్తకాలమందు చికిత్సచేయక ఊరకున్నచో క్షయరోగమును (శాశ్వతముగా) కలుగజేయును.

వాతకాసయందు:— కంఠస్వరము హీనముగానుండుట, కణతలు, హృదయము, ఎదుపు, తల, పిక్కలు, వీటియందునొప్పి, కృశత్వము, పొడిదగ్గును,

పిత్తకాసయందు:— నోటతడిలేకుండుట, దాహము, శోషచేయు, రొమ్ములో మంట, జ్వరము, పసరు, పాండువర్ణము, దగ్గినప్పుడు పసరుతోకూడిన కఫమును

శ్లేష్మకాసయందు:— నాలుకజిగురు, అరుచి, మాంద్యము, తలనొప్పి, దేహమంతటనుజిల. దగ్గినపుడు కఫమును.

క్షతకాసయందు:— (అభిఘాతాదులచే హృదయమున పుండుకలిగిన కాసయును) ఉమ్మివేసినప్పుడు రక్తముతోకూడిన తెమడపెళలుట, రొమ్మునొప్పి, సూదులు గుచ్చినట్లుండుట, కీళ్ళనొప్పులు, జ్వరము, శ్వాస, దాహము, స్వరభేదము, గొంతుకలో పిల్లికూతలును,

క్షయకాసయందు:— మూర్ఛ, జ్వరము, దేహమంతయునొప్పి, మంట, కృశత్వము, ఉమ్మివేసినప్పుడు రక్తముతోకలసిన చీమును,కలిగియుండును. వాత, పిత్త శ్లేష్మజములయిన మొదటి మూడువిధములగు కాసలు నవీనజములయినచో ఒకానొకప్పుడు చికిత్సకుసాధ్యములగును, మిగిలినరెండును రోగిజీవించియున్నంతవరకు తన్నాననుకూలములైన ఔషధాహార, విహారములచేగడుపుకొనవలసినవియునుఅయివున్నవి

## — ♦ మేహరోగసంప్రాప్తి ♦ —

శ్లో॥ ఆస్యాసుఖం స్వప్నసుఖం దధీని
గ్రామ్యౌదకానూపరసాః పయాంసి!

నవాన్నపానం గుడవైకృతీని
ప్రమేహహేతుః కఫకృచ్చ సర్వమ్ ॥౩॥

పనిపాటులు చేయక సుఖముగా కూర్చుండుట, ఎక్కువగా నిద్రించుట, పెరుగు, గ్రామమందును ఉదకము లెక్కువగల జలప్రాంతభూములందును నివసించు జంతువులమాంసము, పాలు, క్రొత్తఅన్నము, క్రొత్తనీరు, బెల్లముతో చేయబడిన పిండి వంటలు, (భక్ష్యములు,) శ్లేష్మవృద్ధికరములైన పదార్థములు, వీటిని సేవించుటచే, మేహరోగము జనించును. ॥౩॥

## —♦ మేహరోగభేదములు ♦—

శ్లో॥ మంజిష్ఠపిష్టసికతాః క్షీమత శ్చ శుక్ల
క్షారేక్షుసాంద్రమధుహస్తివసా హరిద్రాః।
మజ్జాసురోదకశనైః సహ రక్తశీతే
లాలేతి కాల ఇతి నీలఇతి ప్రమేహాః ॥౪॥

(1) మంజిష్ఠమేహము, (2) పిష్టమేహము, (3) సికతామేహము, (4) శుక్లమేహము, (5) క్షారమేహము, (6) ఇక్షుమేహము, (7) సాంద్రమేహము, (8) క్షౌద్రమేహము, (9) హస్తిమేహము, (10) వసామేహము, (11) హరిద్రామేహము, (12) మజ్జామేహము, (13) సురామేహము, (14) ఉదకమేహము, (15) శనైర్మేహము, (16) రక్తమేహము, (17) శీతమేహము, (18) లాలామేహము, (19) కాలమేహము, (20) నీలమేహము, అనుభేదములచే మేహరోగము యిరువదివిధములు. వీటిలో (10) కఫజములు, (6) పిత్తజములు, (4) వాతజములు. అని తెలియవలెను. మూత్రము ఎక్కువగా వెడలుట, మలినముగానుండుట, యీరెండులక్షణములును సామాన్యముగా అన్ని మేహరోగములయందును ఉండును. మరియు, తెలుపు, నలుపు పసుపు, ఎరుపు మిశ్రవర్ణము, వీటిలో ఏదోయొకరంగుకూడా కలిగియుండును.

మంజిష్ఠమేహమున:— ఎర్రటిరంగు, దుర్గంధముగల మూత్రమును,

పిష్టమేహమున:— పిండికలిపిననీటివలె తెల్లనైనమూత్రమును,

సికతామేహమున:— మూత్రబిందులు ఇసుకవలెను.

శుక్లమేహమున:— ఇంద్రియముతో కూడినమూత్రము, లేక ఇంద్రియముతో సమానాకారముగల మూత్రమును,

క్షారమేహమున:— క్షారోదకమువంటిమూత్రమును.

ఇక్షుమేహమున:— చెఱకురసముతో సమానవర్ణముగల మూత్రమును,

సాంద్రమేహమున:— రాత్రిరోజు సాయంకాలమువరకు నుంచినపాత్రలో పట్టిన

ఇక్షుమేహము: మరుచటిఉదయమునకు చిక్కపడునట్టిమూత్రమును,

సాంద్రమేహమున:— కషాయ, మధు, గంధములుగల మూత్రమును,

హస్తిమేహమున:— గజమదముతో సమానవర్ణముకలిగి, వేగరహితమైన మూత్రమును

వసామేహమున:— మాంసముకడిగిన నీటివంటిమూత్రమును,

హరిద్రామేహమున:— పచ్చనిరంగుకలిగి మంటతోకూడినమూత్రమును,

మజ్జామేహమున:— క్రొవ్వుకలసినమూత్రమును.

సురామేహమున:— కల్లువంటిమూత్రమును, మరియు, పిడచినమూత్రము పైన తేరి తేటకలెను: అడుగుభాగమున మడ్డిగాను. ఉదకమేహమున, స్వచ్ఛమై, గంధశూన్యమైన మూత్రమును,

శనైర్మేహమున:— బొట్టుబొట్టుగాగాని, స్వల్పముగా గాని మెల్లగా గాని వెడలునట్టిమూత్రమును,

రక్తమేహమున:— రక్తవర్ణముకలిగియుండి, దుర్గంధయుక్తముగాను, వేడిగాను వెడలునట్టిమూత్రమును.

శీతమేహమున:— మధుగంధయుక్తమై చల్లదనముకలిగి మిక్కిలిఅధికముగా వెడలునట్టిమూత్రమును,

లాలామేహమున:— చొల్లువలె జిగురుకలిగి తీగెలుసాగెడు మూత్రమును,

కాలమేహమున:— బొగ్గునీళ్ళవంటి మూత్రమును,

నీలమేహమున:— ఆకాశరంగుగల మూత్రమును కలిగియుండును. పైని ఉదహరింపబడిన మేహరోగములు యుక్తకాలమున చికిత్సింపబడనిచో క్రమక్రమముగా మూత్రమునందు తీపిచేరి కొంతకాలమునకు మధుమేహముగా మారును. దీనికే అతిమూత్రమనియు, బహుమూత్రమనియు, చెప్పుదురు. శరీరమునగల తీపిచే మూత్రమున తీపిచేరిన స్థితిమేహమును, మధుమేహము అని చెప్పబడుచున్నది.॥౨౮॥

## —♦ బహుమూత్రలక్షణములు ♦—

శ్లో॥ దుర్గంధస్వేదకార్శ్యభ్రమతిశయరసనాపాదనేత్రోపతాపా
శ్శీతేచ్ఛాపాండువర్ణక్షతధుశిథిలతాకంఠతాల్వోష్ఠశోషః।
వక్త్రేఽసహ్యోఽతిదాహస్స్ఫుటతరపిటకాగాత్రతాపీతమూత్రం
మూత్రస్థామాక్షికాద్యాః ఖలు నను బహుమూత్రేఽమయే
సంభవంతి॥ ॥౨౯॥

బహుమూత్రరోగమున శరీరమునందు దుర్గంధమును, చెమట, కృశత్వము, చెవులు, అరిచేతులు, నాలుక, అరికాళ్ళు, నేత్రములు వీటియందు తాపము, చల్లటి

పదార్థములయందిచ్ఛ లేకుండుట, శరీరము పొడిబారుట, దప్పి, శరీరము పల్చబారుట, కంఠము, కనుబొమలు, పెదవులు, ఇవి ఎండుట, శ్రోత్రములు సవ్యముగానుండుట, విదాహము, శరీరమునందు పిటకలుజనించుట, మూత్రము పచ్చగానుండుట, మూత్రమునందు యీగలు, చీమలు, ముసురుట, ఇట్టిలక్షణములు కలిగియుండును.

## —♦ అతిసారరోగసంప్రాప్తి ♦—

దేహప్రవృద్ధద్రవరూపధాతుః
స్రోధాయ మాంద్యం మలసంప్రయుక్తః।
అపానవిద్ధం సరతిప్రకామం
జ్ఞేయం వ్యతీసార మిదం సుఘోరమ్॥ ॥౧౬॥

దేహమునందు మితిమీరి వృద్ధినొందిన ద్రవధాతువులు (రసము, జలము, మూత్రము, చెమట, కొవ్వు, కఫము, పిత్తము, రక్తము, మొదలైనధాతువులు) జఠరాగ్నిని చల్లార్చి మలముతోకూడినవై అపానవాయువుచే ప్రేరేపింపబడి మాటిమాటికి బయలువెడలుచుండును. యీఅతిసారవ్యాధిని మిక్కిలి క్రూరమైనదానినిగా తెలియనగును. ॥౧౬॥

## —♦ అతిసారరోగలక్షణం ♦—

శ్లో॥ సామం శకృన్నిరామం వా కేన వా ప్యతిసార్యతే।
సోతిసారోఽతిసరణా దాశుకారీ స్వభావతః॥ ॥౧౭॥

ఏవ్యాధిచేతనైనను పక్వముగానట్టిగాని, పక్వమైనట్టిగాని, మలము అధోమార్గమున వెడలింపబడునో అదియే అతిసారరోగము. ఇది అధికముగా వెడలుటవలన అతిసారమనియని చెప్పబడుచున్నది. యీఅతిసారరోగమందు స్మరణకు వచ్చినంతమాత్రముననే మలము వెలువడుచుండును. ॥౧౭॥

## —♦ అతిసారరోగభేదములు ♦—

శ్లో॥ పృథక్ త్రిదోషై శ్శోకేనామేన మడ్విధః।
అతిసారం విజానీయా ద్ద్వంద్వభేదేన కేచన॥ ॥౧౮॥

యీఅతిసారరోగము వాత, పిత్త, శ్లేష్మములచే ప్రత్యేకముగాను, త్రిదోషసముదాయముచేతను, దుఃఖాదికముచేతను, అజీర్ణముచేతను, ఆరువిధములైనదానినిగా

తెలిసికొనవలెను. మరియు, కడుపుతో కూడుకొని, హృదయము, గుదము, పొట్ట, పొత్తికడుపు, ప్రక్కలు, చేతులు, కోష్ఠము, వీటియందునొప్పి, అపానవాయువు, మలము సాఫీగా బయలువెడలకుండుట, భుజించినపదార్థము యుక్తకాలములో జీర్ణము కాకుండుట, యీలక్షణములు సామాన్యముగా అన్నివిధములైన అతిసారరోగములయందును ఉండును.

వాతాతిసారమున:— మలము వెడలునప్పుడు సహింపరానిబాధ, శబ్దము, ఎర్రని నురుగతోకూడినమలము, పక్వముగానిమలము, కొంచెము కొంచెముగా వెడలుటయును.

పిత్తాతిసారమున:— గుదస్థానము పక్వమగుట, పచ్చని లేక ఎర్రని, లేక నల్లని, రంగుగలమలము మాటిమాటికి వెడలుటయు, దాహమును.

కఫాతిసారమున:— దుర్గంధయుక్తమై జిగురుగల తెల్లటిమలమును, సన్నిపాతాతిసారమున (త్రిదోషాతిసారమున) పయినచెప్పిన లక్షణములలో కొన్నిగాని అన్నియుగాని కలిగియుండుటయు, మలము, మాంసము, కలిగిననీటివలెనుండుటయు

శోకాతిసారమున:— ధనక్షయము, పుత్ర, మిత్ర, కళత్రాదుల మరణము, వీరివియోగము, వీటిచే ఆహారాదికమందయిష్టముకలిగి దేహమునందు ఒకవిధమైన ఆవిరిబయలుదేరుట, జఠరాగ్నియందు ప్రవేశించి రక్తమును పాడుచేసి స్వస్థానము నుండి ఆరక్తమును చలింపచేయును. అట్టితరి మలసంయుక్తమైనట్టిగాని, ఎర్రని మలము, అనేకసార్లు బయలువెడలుట, కలిగియుండును. భుజింపబడినఆహారము జీర్ణముగాక అనేకవిధములైన రంగుకలిగి మాటిమాటికిమలము వెడలినయడల ఆమాజీర్ణమనియు పిత్త, రక్తములకు తేడాలేనందున పిత్తాతిసారమే రక్తాతిసారమనియు, తత్వమునకు సరిపడని ఆహారాదులచే మలము స్వస్థానమున సంచితమై బలాత్కారమున బయలు వెడలినయడల ప్రవాహికయనియు, జ్వరమును అతిసారమునుకూడ ఏకకాలమునందే జనించినయడల జ్వరాతిసారమనియు, మలమును నీటిలో వేసినయడల మునిగినచో సరిగా పక్వముకాలేదనియు, మునగక పైకితేలినచో సరిగా పక్వమైనదనియు మలమూత్రములు విరివిగా వెళ్ళుట మొదలిడినచో అతిసారవ్యాధి మళ్ళుదలపట్టినదనియు; తెలుసుకొనవలెను. ॥రా.సా.

— ఛర్దిరోగసంప్రాప్తి —

శ్లో॥ స్నిగ్ధై రహృద్యై ర్లవణై రతిద్రవైః
కాలాతిరేకై రశుచిభి శ్చ భోజనైః
ఛర్ది ర్భవే ద్బీభత్సాద్ధృక్ శ్రమాదిభి
శ్చామాశయస్థ క్రిమిణాం చ గుర్విణాం॥ ॥శా

జిడ్డుగలిగినవి, మనస్సుకింపులేనివి, ఉప్పు ఎక్కువగాకలవి, మిక్కిలి వస్త్రరూపమైనవి, సరియైన కాలనియమములేనివి, తినగలిగినమితి నతిక్రమించినవుట, ఇట్టి భోజనములచేతను భయము, శ్రమపడుట, మొదలైనవాటిచేతను ఆమాశయమున పాములుగాని, పురుగులుగాని ఉండుటచేతను, గర్భధారణచేతను, ఛర్దిరోగము కలుగును. ॥౯౯॥

శ్లో॥ ఉద్గారరోధో హృల్లాసః ప్రసేకో లవణాఽస్యతా।
అన్నే పానేఽసహ్యతా చ ఛర్దిరోగస్య లక్షణం॥ ॥౧౦౦॥

తేణుపులు సరిగారాక లోపలనే అణగిపోవుట, ఒకిరింతలు, నోట నీళ్లు కారుట, నోరు ఉప్పగానుండుట, అన్నమందు, దాహమందును, అసహ్యము, ఛర్దిరోగమున ఇట్టిలక్షణములు కలిగియుండును. ॥౧౦౦॥

—• ఛర్దిభేదములు •—

శ్లో॥ పంచధాఽఽగంతుకశ్ఛర్దిస్త్రిదోష స్సన్నిపాతజః।
అసహ్యదర్శనాద్యైస్స్యాత్స ఏవాఽఽగంతుకస్స్మృతః॥ ॥౧౦౧॥

వాత, పిత్త, శ్లేష్మ, సన్నిపాత, ఆగంతుక భేదములచే ప్రత్యేక ప్రత్యేకముగా ఛర్దిరోగము అయిదువిధమును.

వాతఛర్దియందు:— హృదయము, పక్కలు, బొడ్డు, వీటియందు నొప్పియు, తలనొప్పి, నోరెండుట, కంఠమునందును, శరీరమునందును. వేదన స్వరము మారిపోవుట, స్వల్పముగాను, కష్టముగాను, వాంతియగుటయును,

పిత్తఛర్దియందు:— కళ్ళు, మెంగము తిరుగుట, నోటతడిలేకుండుట, దాహము, మూర్ఛ, కన్నులుమండుట, చేదుగాను, వేడిగాను, ఉండుట, పసరు నోటినుండి వెడలుటయును,

శ్లేష్మఛర్దియందు:— రుచితెలియకుండుట, భుజించినట్లు మందముగానుండుట, నోరు తియ్యగానుండుట, నిద్ర, ఒళ్ళుబరువు, తెల్లనితెమడ నోటినుండి వెడలుటయును,

సన్నిపాత త్రిదోషఛర్దియందు:— అజీర్ణము, దాహము, ఆయాసము, కడుపునొప్పి, ఒళ్ళుతెలియకుండుట, అరుచి, పుల్లని లేక ఉప్పనివాంతి చిక్కగా నగుటయును కలిగియుండును

ఆగంతుకఛర్దియందు:— ఛర్దిరోగసంప్రాప్తియందు చెప్పబడినలక్షణము లన్నియు, ఆగంతుక కారణములేయగుటవలన వాటివల్లనుంచి పుట్టుటచే ఆగంతుక ఛర్దిఅని చెప్పబడుచున్నది. ॥౧౦౧॥

## —♦ క్షయరోగసంప్రాప్తి ♦—

శ్లో॥ వేగావరోధా ద్వనితావిహారా
ద్వ్యాయామయోగా ద్విషమాశనాచ్చ।
ప్రజాయతే హేతుచతుష్టయేన
క్షయస్త్రిదోషప్రబల స్సకామం॥ ॥౯౨॥

మలమూత్ర అపానవాతాదులను అరికట్టుట, అధికమైన వనితావిహారము, తన శక్తికిమించిన పనులనుచేయుట, మితినివిడిచి ఎక్కువగాగాని, తక్కువగాని భుజించుట, యీనాలుగు కారణములచేతను, త్రిదోషప్రకోపమైన (సాన్నిపాతకమైన) క్షయవ్యాధికలుగుచున్నది. ॥౯౨॥

## —♦ క్షయరోగలక్షణములు ♦—

శ్లో॥ కార్శ్యాఽజీర్ణశిరోభ్రమాఽరుచికఫోద్రేకాఽగ్నిమాంద్యజ్వరో
న్మాదాఽయాపనినిద్రతాగ్రహణిహృల్లాస స్స్వరవ్యత్యయాః।
హృత్తాపక్షపథుభ్రమాఽబలమరుద్వాంత్యన్నవిద్వేషణాఽ
నాహోత్తాపవిశూలాంతతనుతా హేఽథ్మాభవేయుః క్షయే॥ ॥౯౩॥

చిక్కుట, అజీర్ణము. తలతిరుగుట. అరుచి, మిక్కుటముగా కఫము బయలు వెడలుట, అగ్నిమాంద్యము, జ్వరము, ఉన్మాదము, ఉబ్బసము, నిద్రపట్టకుండుట, గ్రహణి, ఓకిరింతలు, స్వరహీనమగుట, లేక స్వరముమారుట, గుండెలలోమంట, దగ్గు, ఒళ్ళుతిరుగుట, నీరసము. వాంతులు, చలి, అన్నమందయిష్టము, కడుపుబ్బరము (మలమూత్రసంకోచము) తాపము, శూల, శరీరమెండుట, ఊపిరిగొట్టునొప్పి; యివి సాధారణముగా అన్నివిధములైన క్షయలయందును నుండును. త్రిదోషజనితములైన యీక్షయలన్నియు,

ఏకాదశరూపములు:— (1) స్వరభేదము, (2) శూల, (3) భుజములు, (4) జ్వరము, (5) దాహము, (6) అతిసారము, (7) నోటినుండిగాని, ముక్కులనుండిగాని, రక్తమువెడలుట, (8) శిరోభారము, (9) అన్నద్వేషము, (10) దగ్గు (11) మెడ నిలబడకుండుట, గలవియు,

షడ్రూపములు:— (1) పార్శ్వములయందు నొప్పి, (2) స్వరభేదము, (3) అతిసారము. (4) జ్వరము, (5) దగ్గు, (6) అరుచి గలవియు,

త్రిరూపములు:— (1) జ్వరము, (2) దగ్గు, (3) రక్తాతిసారము. గలవియు అయియున్నవి. యీమొత్తముఏకవింశతిక్షయలని చెప్పబడుచున్నవి, ॥౯౩॥

### క్షయరోగభేదములు

శ్లో॥ యక్ష్మాఽజీర్ణగ్రహణీవమ నోద్గారదాహాతిసారా
హిక్కాహిధ్మా కృశకఫహారిద్ర రక్తమందాగ్నిమూర్ఛాః।
శోషా పాండు స్సకలవిధరుగ్రూపగా మిత్రి శాంత్యై
శ్శక్యో నాయం పరిణతిగత శ్శోషసంతాపతంద్రాః। ౯౮॥

రాజయక్ష్మ (క్షయరోగము) అజీర్ణము, గ్రహణి, వమనము, ఉద్గారము(త్రేన్పు) దాహము అతిసారము, హిక్క (ఎక్కిళ్లు) హిధ్మ (ఊపిరిసల్పనొప్పి) కృశత్వము, కఫము, హారిద్ర (పసుపుపచ్చవారుట) రక్తము, మందాగ్ని, మూర్ఛ, శోషపాండువు శోప, సంతాపము. తంద్రి, అనువివిధవ్యాధులయొక్క రూపమునుపొంది, ఆయా రోగవికారములను ధరించి పోల్చుటకుగాని చికిత్సకుగాని శక్యముకాదు, యీక్షయ రోగము అనులోమ, ప్రతిలోమభేదములచే. రెండువిధములు, మలమూత్రాదుల నిరోధముచే వాతాదులు కుపితములై రసధాతువాహులను ఆక్రమించును, అందువలన రసధాతువు స్వస్థానమందేయుండి రక్తాది ధాతువులకుబలమును కలుగచేయజాలదు, గాన మిగిలిన ధాతువులన్నియు శుక్రమువరకు అనులోమక్రమమున క్షీణించును (ఇదేఅనులోమక్షయ) మితిమీరిన స్త్రీసంపర్కముచే శుక్రధాతువు క్షీణించినచో మిగిలినధాతువులన్నియు రసమువరకు ప్రతిలోమక్రమమున క్షీణించును, (ఇదేప్రతిలోమక్షయ)

### పాండురోగసంప్రాప్తి

శ్లో॥ వ్యాయామ (వ్యయామ) మామ్లం లవణం చ మద్యం
మృదం దివా స్వాప మతీవ తీక్ష్ణం
నిషేవ్యమాణస్య విదూష్య రక్తం
కుర్వంతి దోషా స్త్వచి పాండు మేతే॥ ॥౯౯॥

మితిమీరిన, దేహపరిశ్రమ (మితిమీరిన స్త్రీసంగమము) పులుసు, ఉప్పు, మద్యము, మన్ను, పగటినిద్ర, కారము, లేక తీక్ష్ణమైన (కఠినమైన) పదార్థములు, వీటిని మిక్కుటముగా సేవించుట, వలన, వాతాదిదోషములు, శరీరమునందలిరక్తమును, పాడుచేసి, చర్మమునందు పాండువర్ణమును కలుగజేయును, కామిల, కుంభకామిల, హలీమకములు పాండురోగభేదములైయున్నవి॥ ॥౧౦౦॥

### పాండురోగలక్షణములు

శ్లో॥ హృత్స్పందనిష్ఠీవనమాంద్యకార్శ్యాఽ
స్వేదశ్రమప్రేక్షణకూటశోథాః

త్వక్స్ఫోటమృద్భక్షణపీతవేగాః
సన్నద్వేషకర్ణధ్వనిలోమహర్షాః ॥ ౬౭ ॥

పాండురోగమునకుముందెల్లనొచ్చుటకు. నోటచొల్లు, ఆగ్నిమాంద్యము. చిక్కుటు చమటపట్టకుండుట, ఆయాసము, కంటికొలికిలయందువాపు, చర్మముపగులుట మట్టి తినుట, మలమూత్రములు పచ్చగానుండుట, అన్నద్వేషము, చెవులలోహోరు, శరీర మునందలి వెండ్రుకలూడిపోవుట ఇట్టిలక్షణములు కలిగియుండును. ॥ ౬౭ ॥

—♦ పాండురోగభేదములు ♦—

శ్లో॥ పాండురోగాః పంచవిధా వాతపిత్తకఫైస్త్రయః ।
సన్నిపాతా చ్చతుర్థశ్చ పంచమో భక్షణాన్మృదః ॥ ౬౮ ॥

వాత, పిత్త, శ్లేష్మభేదములచే ప్రత్యేకముగాను, త్రిదోషసమవాయము (సన్నిపాతము) చేతను, మట్టితినుటచేతను, కలుగుటవలన యీపాండురోగము అయిదువిధములైయుండి,

వాతజపాండువునందు:— మలమూత్రములు, కన్నులు, చర్మము మొదలైనవి, నునుపులేక, యెఱుపెక్కి, పోటు. వణుకు,కడుపుబ్బరము, ఒళ్లుతిరుగుట మొదలైనలక్షణములును,

పిత్తజపాండువునందు—: మలమూత్రములు, కన్నులు, శరీరముపచ్చదనము కలిగియుండుట, తాపము. దాహము, జ్వరము, మూర్ఛ, చమట, చల్లదనమందు యిష్టము, అన్నద్వేషము, నోరుచేదు, మలము ఊడలుకట్టుటయును,

శ్లేష్మజపాండువునందు—: నోటినుండి తెమడ వెడలుచుండుట, వాపు, నిద్ర తాపము, ఒళ్లుబరువు, మలమూత్రములు, కన్నులు, శరీరము, తెలుపుకలిగియుండుట, శ్వాస, దగ్గు, నోరుతియ్యగానుండుట, వేడిని, కారమును సహించుటయును;

సన్నిపాతపాండువునందు—: వాతాదిపాండురోగలక్షణమును కలిగియుండుట, జ్వరము. అరోచకము, ఓకిరింత, వాంతి, దాహము, బడలిక, దౌర్బల్యము చక్షురాదీంద్రియములకు పాటవము లేకుండుటయును;

మృత్పాండువునందు—: నిస్సత్తువ. కన్నులు, చెక్కిళ్లు, కనుబొమ్మలు, పాదములు. బొడ్డు, గుహ్యప్రదేశము. వీటియందువాపును, కడుపులోపాములుపుట్టుట యిట్టిలక్షణములుకలిగియుండును, పాండురోగమున స్వతస్సిద్ధముగాగాని కేవల పిత్తాధిక్యముచేగాని కామిలావ్యాధి జనించును;

యీ కామిలావ్యాధియందు—: కన్నులు, చర్మము, గోళ్లు, ముఖము పచ్చగానుండుట, మలమూత్రములు పచ్చగాగాని, ఎఱ్ఱగాగాని, యుండుట, చిక్కుట, పని పాటలయందసామర్థ్యము ఒళ్లునొప్పులు యిట్టిలక్షణములు కలిగియుండును, కామి

వాత, పిత్త, శ్లేష్మములు, జఠరాగ్ని, రసాదిధాతువులు, మలము, చర్యలు, (నిత్యకృత్యవ్యవహారములు) ఇవి సరిగా (హెచ్చుతగ్గులు లేక యథాప్రకారముగా) నుండుట, నిర్మలమైన ఆత్మ, ఇంద్రియములు, మనస్సు, ప్రసన్నములై యుండుట, ఇట్టిలక్షణములుకలవాడు స్వస్థుడు, (నీరోగి) అని చెప్పబడుచున్నాడు. ॥౯౯॥

శ్లో॥ ఇత్యేకవింశద్విధరుక్స్వరూపం
బాలప్రబోధాయ లఘుప్రణీతం।
ఇతః క్రమాద్భ్యాసజపారిపాట్యా
సమున్నయేచ్చాద్య మథవా దసుర్తాః। ॥౧౦౦॥

ఈప్రకారము బాలకులకు సులభముగా తెలియునిమిత్తమై యిరువైయొక్కవిధములైన వ్యాధులయొక్కపోలిక సంగ్రహముగాను, (సులభముగాను,) చెప్పబడినది గాన బాలకులు యీగ్రంథపఠనము క్రమక్రమముగా అలవడిన అభ్యాసపాటవము, స్వానుభవము, అనువాటిచే యీగ్రంథమున చేర్చబడనివియు, తమకు, తటస్థపడునవియు, అగు సర్వవిధవ్యాధులను ఊహాబలముచే తెలుసుకొనవలెను.॥ ॥౧౦౦॥

ఇతి శ్రీచికిత్సాగదసంగ్రహాఖ్యే శ్రీసోమయాజిసత్పథే

సత్పథప్రకరణేషు

నిదానప్రకరణమ్.



శ్రీగణేశాయ నమః.

# చిత్రాగదసంగ్రహాఖ్యే

# శ్రీసోమయాజినప్రథే

## వర్ణాగదప్రకరణమ్



### —♦ వర్ణాఽగదప్రకరణమ్ ♦—

శ్లో॥ నమామి ధన్వంతరి మాదిదేవం
సురాసురై ర్వందితపాదపద్మం
లోకే జరారుగ్భయమృత్యునాశం
దాతార మీశం వివిధౌషధీనాం॥ ॥౧॥

దేవతలలో మొదటివాడు, దేవదానవులచే నమస్కరింపబడు పాదపద్మము కలవాడు. ముసిమి, వ్యాధులు, అపమృత్యువు, వీటియొక్క భయమును పోగొట్టు వాడు సమస్తవిధములయిన ఓషధులను ఇచ్చువాడు, ఐశ్వర్యసంపన్నుడు అయిన ధన్వంతరిని నమస్కరించుచున్నాను॥

శ్లో॥ బాలానాం సుఖధారణాయ గృహిణాం సంప్రాప్తరుక్శాంతయే
వైద్యానా మఖిలామయ ప్రశమనప్రజ్ఞోపలంభాయ చ।
ఆమూలాగ్రవిలోకనం మతిమతాం సర్వక్రియాసిద్ధయే
ప్రోయేణాఽల మముష్య ముఖ్యవిషయప్రజ్ఞానసంపత్తయే। ॥౨॥

యీగ్రంథముయొక్క ఆమూలాగ్రపఠనము, బాలకులకు సుఖధారణ, గృహస్థులకు ప్రాప్తమయిన రోగములనుపోగొట్టుకొనుట వైద్యులకు,సమస్త రోగములయొక్క ఉపశాంతిని కలుగజేయుప్రజ్ఞసంపాదించుకొనుట, వైద్యశాస్త్రమునందుగల ముఖ్యవిషయములయొక్క చిహ్నములను గ్రహించుట, అనువాటికొరకు చాలును. ॥౨॥

### —♦ వర్ణాఽగదప్రకరణమ్ ♦—

శ్లో॥ సౌభాగ్యం ప్రకటీకరోతి లఘు వా మాంగల్యసూత్రం ధృతం
మూల్యా న్యాభరణాని చంచలదృశాం సర్వా ణ్యతిక్రమ్య చ।

వైద్యత్వం ప్రకటీకరోతి పఠితం కావ్యం సదేవ త్రిధా
సాధ్యాసాధ్యమరూహ్యాభేషజయుతగ్రంథా నతిక్రమ్య చ॥ ౩॥

సూక్ష్మమయిన దయినప్పటికి (తక్కువవెలకలదయినప్పటికి) మంగళమూర్తిము, ధరింపబడినదగుచు, గొప్పభూషణము కలిగి, ఆభరణముల నతిక్రమించి, స్త్రీల యొక్క సౌభాగ్యమును ఎట్లుప్రకటన చేయుచున్నదో, అట్లేసూక్ష్మమయినద యినప్పటికి యీకావ్యము పఠింపబడినదగుచు కొన్ని సాధ్యములున్ను, కొన్ని అసాధ్యములున్ను అయి ఊహించుటకుకూడా సాధ్యముకాని. రోగములతో కూడిన గ్రంథముల నతిక్రమించి పాఠకులయొక్క వైద్యత్వమును ప్రకటనచేయుచున్నది॥

శ్లో॥ సామాన్యరోగేషు నిమజ్జితాని
యాన్యల్పయత్నాని గుణాధికాని
ఉద్ధృత్య తాని ప్రకటీకృతాని
వర్ణోపమా నాగదసంజ్ఞయాత్ర॥ ౪॥

సామాన్యములయిన రోగములతో కలసిపోయినవి స్వల్పమయిన వ్యయప్రయాసలు కలవి అధికమైన గుణములు కలవి అయిన రోగములుఏవి కలవో అవియే, ఎత్తి వర్ణాగదములు (అక్షరములతోపోల్చతగినమందులు) అనుసంజ్ఞతో యిక్కడ, ప్రకటన, చేయబడినవి. ౪॥

శ్లో॥ బాలానాం ప్రథమప్రవేశసమయే వర్ణా ఇవాఽత్రాగదాః
పంచాశ త్సముదీరితాః ప్రథమత స్తానభ్యసే ద్యత్నతః।
ప్రాగ్వర్ణగ్రహణా త్సమ స్తనిగమప్రాజ్ఞాభవేయు ర్యథా
వైత్రోక్తౌషధకల్పనోచితధియ స్సర్వాగదజ్ఞానినః॥ ౫॥

బాలకులకు అక్షరాభ్యాస కాలమున అక్షరములవలె (50) మందులుచెప్పబడినవి గాన వాటియొక్క నిర్మాణ ప్రయోగోప సంహారములను అభ్యసింపవలెను పంచాశద్వర్ణ విజ్ఞానముచే వివిధశాస్త్ర పారంగతు లెట్లగుచున్నారో, అట్లేయిక్కడ చెప్పబడిన పంచాశదగద విజ్ఞానముచే సకలగ్రంథోదితౌషధవిజ్ఞాన పారంగతు లగుచున్నారు॥ ౫॥

శ్లో॥ సర్వే ప్యేకవిధానధాని కతిచి ద్యా నైవ కుర్యు ర్యత
స్తన్నత్స్వీయ (స్వస్వ) మతైక్యతాతదఖిలైః కార్యాహివర్ణాగదాః

తద్వర్ణాగదసంప్రయోగశమనజ్ఞానప్రపన్నైః పరం
సంపాద్యాస్సకలాగదాః ప్రతిభయా వర్ణై రివాఽన్యైః కరాః।

వైద్యులందరున్నుకలసి ఒక్కవిధమయిన మందులను కొన్నిటినయినా తయారుచేయుక పోవుటవలన యీవైద్యులకు ఏకమత్యకలుగుటకు యుక్తిగా, లేకపోవుచున్నది, గాన ప్రతివైద్యుడున్ను మందుగా వర్ణాగద సంజ్ఞౌషధములను వాటి విజ్ఞానమును అభ్యసించుకొని, తదనంతరము వారివారి ప్రజ్ఞావిశేషము ననుసరించి యథేష్టౌషధములను పంచాక్షర్ణ విజ్ఞానముచే, ఇతరకలలవలె సంపాదింపవలయును॥ ॥౬॥

శ్లో॥ ఆరోగ్యానుభవేచ రోగశమనే సృష్టా విధాత్రా నృణాం
కాంత్యంబుశ్వసనా నపాస్య యుతతే స్త్రాగేన జాయూ న్ప్రతి।
పూర్వారోగ్య మపి త్యజం త్యనుచిత్తై ర్జాయుప్రయోగై స్తత
స్సేవ న్తా నవశిష్టరోగశమనే జాయూ న్భజే త్సర్వదా ॥౭॥

మానవులయొక్క ఆరోగ్యానుభవముకొరకున్ను రోగోపసంహారముకొరకున్ను బ్రహ్మదేవునిచే సృజింపబడిన వెలుతురు వాయువు అనువాటిని విడిచిపెట్టి మందుగానే మందులకొరకున్ను వైద్యులకొరకున్ను ప్రయత్నించి రోగానుచితము అయిన మందులు మొదలయినవాటిచే పూర్వారోగ్యమునుకూడా కోలుపోవుటతటస్థపడు చున్నదిగాన వ్యాధి అంకురించగానే మానవులసౌఖ్యముకొరకు సృజింపబడిన వెలుతురు గాలి అనువాటినియథోక్తముగా సేవించి అట్లు సేవించినను ఉపశాంతి నొందక నిలిచియున్నరోగోపశాంతికొరకు మందులను సేవింపవలయును ॥౭॥

శ్లో॥ పర్ణాంకాగదశిక్షితేన భిషజా సర్వౌషధవ్యాకృతి
ర్గ్రంథేభ్యః కులవైద్యకేభ్య ఇతి హా వికారియికేభ్యోన్వహం।
జ్ఞేయః కింతు ఫలశ్రుతిప్రచురణవ్యావర్తకై శ్శ్రద్ధయా
రుగ్మి ష్వామయశాంతయే ప్రతిభయాసంయోజయేదూహయా

వైద్యుడగువాడు వర్ణసంజ్ఞాగద విజ్ఞానమును సంపాదించి అటుపిమ్మట గ్రంథాభ్యాసము వంశపరంపరాగత వైద్యాభ్యాసముకలవారు పరంపరోపదేశము వర్తకులు ఆమందుయొక్క గుణాగుణములు మొదలయినవాటిని తెలుపు ప్రచారణములు వీటిచేకొత్తమందులయొక్క విజ్ఞానమును సంపాదింపవలయును ఇట్లువిజ్ఞానమును సంపాదించి తనయూహచే రోగోపశాంతికి తగినమందుయివ్వవలయును ॥౮॥

## —♦ అగ్నికుమారం ♦—

శ్లో॥ సూతం గంధకటంక మేక ముదితం త్ర్యంశం వరాటం విషం
శంఖం చాష్టగుణం మరీచమఖిలం జాంభైం ర్దినంమర్దయేత్।
తాంబూలీదళసంయుతం పరిమితంఖాద్యం పిబేచ్ఛీతకం
హన్యా దగ్నికుమార నామ సకలాజీర్ణా న్విషూచీ రపి॥ ॥౯॥

పాదరసము గంధకము వెలిగారము ఒక్కొక్క భాగము నాభిగవ్వభస్మ శంఖభస్మము మూడేసి భాగములు మిరియములు ఎనిమిదిభాగములు వీటిని నిమ్మపండ్లరసముతో మర్దించబడియున దిది అగ్నికుమారము దీనిని తమలపాకులతోనమలి శీతోదకమును త్రాగినచో సమస్తవిధములైన అజీర్ణములు విషూచిరోగములు శాంతించును. ॥౯॥

## —♦ ఆనందభైరవి ♦—

శ్లో॥ సౌభాగ్యహింగుళకటుంచ విషం మరీచం
సమ్మర్ద్య నింబకరసేన దినత్రయంచ।
ఆనంద భైరవమిదం తు వరీవ్రమాణం
నానానుపానసహితం సకలామయఘ్నం ॥౧౦॥

వెలిగారం ఇంగిలీకం పిప్పళ్లు నాభి మిరియాలు వీటిని వేపచెక్కరసముతో మూడుదినములు మర్దించి కందిగింజపరిమాణమును రోగయుక్తానుపానములతో సేవించినయెడల సమస్తవిధములయిన రోగములు శాంతినొందును. ॥౧౦॥

## —♦ (3) ఆనందరసం ♦—

శ్లో॥ వరాటజాతీఫలసైంధవాఽప్రికణాంచశుంఠీవిష హేమబీజం।
ధుత్తూరమూలస్వరసేన మర్ద్యం యామంతథాఽఽనందరసంప్రదిష్టం॥

గవ్వభస్మ జాజి కాయ సైంధవలవణము ఇంగిలీకము పిప్పళ్లుశొంఠి నాభి ఉమ్మెత్తగింజలు వీటిని ఉమ్మెత్తవేళ్లరసముతో ఒకయామము మర్దించవలెను ఆనందరసము॥ ॥౧౧॥

శ్లో॥ గుంజాప్రమాణంజఠరామయఘ్నంనిహంతివాతంకఫశూలదోషాన్
ఆమాతిసారంగ్రహణీవికారం నిహంతి కార్శ్యంసితయాసమేతం॥

ఈ ఆనందరసమును గురిగింజ ప్రమాణము సేవించిన జఠరరోగములు వాత

కఫ శూలలు హరించును పంచదార అనుపానముతో సేవించిన రక్తాతిసారము గ్రహణీవికారము కార్శ్యము హరించును. ||౧౨||

—♦ (4. కనకసుందరరసం ♦—

శ్లో॥ హింగుళోత్థరసం కణమరీచికగంధకంచ
తుల్యం విమర్ద్య విషాణికయుతంచ యామద్వయం సుమర్ద్యః
భృంగరసైః కనకసుందర ఏష నామ్నా
వాతాతిసారం దధిపథ్యమాహారః ||౧౩||

హింగుళోత్థ రసము వెలిగారం మిరియాలు పిప్పళ్లు రసము గంధకము నాభి వీటిని సమభాగములుగ గుంటగలగరాకు రసముతో రెండుయామములు మర్దించవలెను ఇది కనకసుందర రసము వాతాతిసారములను శమింపచేయును పెరుగు అన్నము పథ్యము. ||౧౩||

—♦ (5) కాలకూటః ♦—

శ్లో॥ హింగూగ్రశ్వేత తామ్ర గంధకశిలాటంకం హరిద్రాగ్నికం
సంమర్ద్యం త్రిఫలం కటుత్రయవిషం ప్రత్యేకయామం పృథక్।
ఏకైకత్రిచతుర్మదృశునసబ్రహ్మాంక దిగ్భాగకైః
స్థాణ్వాంశైః రసిలానుయప్రశమనం సంమర్దయేద్భావిభిః ||౧౪||

ఇంగువ నస ఒక్కొక్క భాగము రసము మూడుభాగములు తామ్రభస్మము నాలుగుభాగములు గంధకము అయిదుభాగములు మణిశిల వెలిగారము ఆరేసిభాగములు హరిద్రము చిత్రమూలము 9భా॥ త్రిఫలములు 10భా॥ త్రికటుకములు పన్నెండుభా॥ నాభిపదకొండుభాగములు వీటిని యాదిగుకరసములతో ఒక్కొక్కదానితో ఒక్కొక్క యామము మర్దింపవలయును ఇది కాలకూటము. ||౧౪||

శ్లో॥ శిగ్రుగ్రాహ్యానలార్ద్రకంగలికవిప్రహ్లాదికా తామ్రికా
తాంబూలీసితకోలమూలలశునాజంబాటవీశిగ్రుకైః
క్షుణ్ణం మర్ద్యచ కాలకూటమగదం శామ్యంతి సర్వామయా
స్నానం చందనలేపనం దధి భజేత్తాపే ప్రజాతేసతి॥ ||౧౫||

మునగ ఊడుగు చిత్రమూలము అల్లము చిన్నచర్లగడ్డ జిల్లేడు హంసపాది గులివింద తమలపాకు వావిలి పంచకోలములు (పిప్పలిపిప్పలిమూలము చవ్యము చిత్రమూలము శొంఠి) పంచమూలములు (మయ్యాకుపొన్న కోలపొన్న ములక వాకుడు

పల్లేరు) శల్లలి నిమ్మరసము అడవిమూలగ వీటిరసములతో (కషాయములతో) ప్రత్యే కప్రత్యేకముగా ఒక్కొక్క జాము మర్దించి గురిగింజప్రమాణము రోగయుక్తాను పానములతో సేవింపవలయును దీనిని సేవించుకాలమున స్నానము మంచిగంధము పూసుకొనుట పెరుగుపోసుకొనుట మొదలయిన పథ్యములు లిగియుండవలెను. ॥౧౫॥

## — ♦ (6) కాంతవల్లభరసం ♦ —

శ్లో॥ కిట్టం కాంత మయో రజో మనశ్శిలా టంకం శిలాజ త్తథా
పశ్చాత్తుత్థ్యకిలా చతుర్దశగజాఽశా షట్క్రమాత్సంగ్రహేత్।
పూతం సర్వసమంచ గంధకమపి క్షిప్త్వాఽర్ద్రమూషోదరే
సప్తాహేనతు కాంతవల్లభరస స్స్యా ద్వాలుకాయంత్రకే॥ ॥౧౬॥

మాండూరభస్మ పన్నెండుభాగములు కాంతభస్మపదహారుభాగములు ఖడ్గలోహ భస్మ పద్నాలుగుభాగములు మణిశిల యెనిమిదిభాగములు వెలిగారము పదిభాగములు కర్పూరశిలాజిత్తు ఆరుభాగములు పాదరసము వీటికన్నిటికినిసమానము గంధకము రసమునకుసమానము వీటినన్నిటిని ఏకముచేసి ఆర్ద్రమూసయందుంచి వాలుకాయంత్ర మున ఏడురోజులు వండవలయును. ॥౧౬॥

శ్లో॥ పాండుశ్వాసభగందరక్షవథురుక్ప్లీహోదరాఽర్శోఽనిలాఽ
జీర్ణారోచకశూలకుష్ఠవమిసంతాపగ్రహణ్యామయాన్।
శోషంహంతిచవీర్యవృద్ధి మమితం పుష్టిం తథా జాఠరం
సంతోషం వితనోతి మాక్షికయుతో నిష్కప్రమాణంభజేత్॥

యీ కాంతవల్లభరసమును నిష్కప్రమాణము తేనెతో సేవించిన పాండువు శ్వాస భగందరము దగ్గు ప్లీహరోగము మూలశంక వాతవ్యాధి అజీర్ణము అరోచకము శూల కుష్ఠరోగము వాంతి జ్వరము గ్రహణి శోష మొదలయినవ్యాధులు ఉపశ మించును వీర్యవృద్ధి పుష్టి బలము అగ్నిదీపనము సంతోషము కలుగును. ॥౧౭॥

## — ♦ (7) క్రిమిముద్గరరసం ♦ —

శ్లో॥ క్రిమోత్తరం పారదగంధమోద
విడంగముష్టిశ్వసనఘ్నబీజం।
నిషేయ నిష్కంమధునాఽథ పేయం
ముస్తాకషాయం క్రిమిముద్గరోయం॥ ॥౧౮॥

పత్త్రైర్మంజుభుజంగవల్లిజనితై ర్నిక్షిప్య భాతే పుటం
దత్వాకుక్కుటసంజ్ఞకం సహదళై స్సంచూర్ణ్య తత్ప్రక్షిపేత్ ॥ ౨౧॥

పాదరసము గంధకము కృష్ణాభ్రకము విసులము (మాక్షికభేదము) సమాన భాగములు పాదరసములో సగము నాభి నాభిలో మూడవవంతు నేపాళగింజల పప్పు వీటిని చూర్ణించి చింతపండులోపాఁగిదానిచుట్టూ తమలపాకులు చుట్టి గోళి యుంచుచి దానికయిని కుక్కుటపుటము పెట్టవలయును అపుటముపక్వము కాగానే తీసిదానికి చుట్టినతమలపాకులతో కూడానూరవలెను. ॥౨౧॥

శ్లో॥ భాగార్ధం జయపాలబీజమమృతం తత్తుల్యమేకావృతం
గుంజానాగరసింధుచిత్రకయుత శ్చింతామణిర్నామకః।
శూలం సంగ్రహణీగదం చ జఠరం సర్వజ్వరా న్నాశయే
త్తాపే సేచన మాచరే ద్గదవతాం పథ్యంతు దధ్యోదనం॥

అట్లు నూరినదానితో భాగమున్నరచొప్పున నేపాళపుగింజలపప్పును, గంధకమును యీరెండింటిని ఏకముచేసి దానితో సమానము గురిగింజవేళ్ళు, శొంఠి, సైంధవలవణము, చిత్రమూలము వీటిచూర్ణములనున్ను, పైఔషధములనున్ను, ఏకము చేసి తమలపాకురసముతో మర్దింపవలెను. ఇది చింతామణి ఇది శూల, గ్రహణి ఉదరరోగము, తాపము, సర్వవిధజ్వరములు, వీటిని పోగొట్టును. ఈమందు పుచ్చు కొనుటవలన తాపముకలిగినచో స్నానముచేయుచుండుటగాని, తడిబట్టలతో తుడుచుకొనుటగాని చేయవలెను. యీమందుపుచ్చుకొన్నవెంటనే పెరుగుఅన్నము తినవలయును. ॥౨౨॥

శ్లో॥ భూశయ్యాసముపాగతేఽపి చ మృతప్రాయే ప్రకృష్టామయే
మాంద్యాజీర్ణమరుత్త్రిదోషవిషమే సర్వజ్వరే దుర్విధే।
ఆధ్మానామయమూలరోగసహితే వాతాఽతిసారాదికే
దేయం భేషజ మేతదేవ భిషజా సద్యో గుణం దృశ్యతే॥ ౨౩॥

భూశయనముచేసినవానికిన్ని, ప్రాణముమీదకువచ్చి బ్రతుకుట సంశయమై యున్నవానికిన్ని, రోగము అసాధ్యస్థితిలోనున్నవానికిన్ని, అగ్నిమాంద్యము, అజీర్ణ వాతము, త్రిదోషవిపర్యయము, కొత్తరకజ్వరములు, ముఖ్యమూలములులేని (తుద మొదలులేని) రోగములు, కడుపుఉబ్బరము, మూలశంక, వాతాతిసారము మొదలయిన వీటికి యీమందిచ్చినచో వెంటనే గుణమిచ్చును. ॥౨౩॥

—♦ (11) జ్వరాంకుశం ♦—

శ్లో॥ ఏకైకభాగం రసగంధకం చ
గోదంతసుంఠీ విషటంకమర్ధం।
దినత్రియం భృంగరసేన మర్ద్యం
జ్వరాంకుశం స్యా దుచితానుపానం॥ ॥౨౮॥

పాదరసము, గంధకము ఒక్కొక్కభాగము హారితాళము, శొంఠి, వెలిగారము, నాభి అర్ధభాగము చొప్పున వీటిని గుంటగలగరాకురసముతో మూడురోజులు మర్దించవలెను. ఇది జ్వరాంకుశము. దీనిని సకలవిధజ్వరములయందును యుక్తానుపానములతో ఇవ్వవలెను. ॥౨౮॥

—♦ (12) జోగినీరసం ♦—

శ్లో॥ గంధటంకణవిషాణిపారదం
వ్యోమదంతికఫలాని తాళకం
భృంగరాజసమర్దితం భజే
జ్జోగినీరస మసుప్రదాయకం॥ ॥౨౯॥

గంధకము వెలిగారము నాభి పాదరసము త్రికటుకములు నేపాళములు త్రిఫలములు ఇవి సమానభాగములు. వీటిని గుంటగలగరసముతో మర్దించవలెను. ఇది జోగినీరసము. ప్రాణమును ఇచ్చును. సన్నిపాతమునకు మోఘమయినమందు. ॥౨౯॥

—♦ (13) తారకేశ్వరరసం ♦—

శ్లో॥ మర్ద్యమభ్రమకరసం దివసంత్రివృ
ర్మాక్షికేన సహ మాష మితం భజేత్!
తారకేశ్వరరసో బహుమూత్రజి
ద్దేమదుగ్ధఫలచూర్ణసమన్వితం॥ ॥౩౦॥

అభ్రకభస్మము రసభస్మము వంగభస్మము వీటిని తేనెతో ఒకరోజు మర్దించవలెను. ఇది తారకేశ్వరరసము. దీనిని మేడిపండ్లచూర్ణముతో కలిపి సేవించిన బహుమూత్రము ఉపశమించును. ॥౩౦॥

లోహం తులాత్ర్యంశక మేకవారం
కన్యాజలై ర్మర్ద్య మసృగ్దరాంతకం॥ ॥౩౧॥

రసము వంగము రజతము గంధకము కపరిగన్యభస్మము ఒక్కొక్కభాగము లోహభస్మము తులము మూడవవంతు వీటిని కలబందరసముతో ఒకరోజు మర్దింపవలెను ఇది ప్రదరాంతకరసము దీనిని యుక్తానుపానములతో సేవించుటవలన స్త్రీలకు సంభవించు అన్నివిధములైన కుసుమరోగములు శమించును. ॥౩౧॥

## —♦ (19) పూర్ణచంద్రోదయం ♦—

శ్లో॥ గంధస్వర్ణరసంకలైకవసుభిః కన్యాఽపత్రికార్పాసజై
స్సమ్మర్ద్యాథ నిధాయ కాచవివరే సంవేష్ట్య మృత్కర్పటైః
అగ్నౌ త్రీణి పచేద్దినాని సికతాయంత్రే చ చంద్రోదయం
యోషిద్దర్పనుదుత్తమౌషధమిదం తాంబూలపత్రాశితం॥

మారినంత మాత్రమున నే భస్మము కాగినంత పలుచనయిన బంగారపురేకులు ఒకతులము పాదరసము ఎనిమిదితులములు గంధకము పదహారుపలములు వీటిని ఎర్రపత్తిపూవులరసముతోనున్ను కలబందరసముతోనున్ను మర్దించి గాజుకుప్పెయందుంచి గుడ్డలుచుట్టి మట్టిపూసి మూడురోజులు వాలుకాయంత్రమునందు సామాన్యమయిన అగ్నితో పచనముచేయగా చిగురుటాకువలె సుందరమయిన భస్మముఆగును ఇదిపూర్ణచంద్రోదయము దీనిని మాషప్రమాణము తమలపాకుమధ్యనుంచి నమిలిమింగినయెడల మిక్కిలిమదోన్మత్తులయిన స్త్రీల గర్వమునడంచువాడగును॥ ॥౩౩॥

## —♦ (20) పైత్యాంతకరసం ♦—

శ్లో॥ ఏకాంశం విమసైంధవం చ సుషవీశృంగం షడంశాన్వితం
ద్వ్యంశం సింధుర మప్రరూపదరదం త్ర్యంశం సుమర్ద్యం దృఢం
జంభీరేణతు పైత్యకాంతికరసం మాషప్రమాణం భజే
త్పైత్త్యాజీర్ణముఖామయభ్రమవమీన్ హిక్కాగ్నిమాంద్యాన్ హరేత్

నాభి సైంధవలవణము ఒక్కొక్కభాగము తెల్లటీకరి అల్లము ఆరేసిభాగములు. రసపింధూరము రెండుభాగములు, ఇంగిలీకము మూడుభాగములు. వీటిని నిమ్మపండ్లరసముతో మర్దింపవలెను. ఇది పైత్యాంతకరసము దీనిని సేవించినయెడల పైత్యములు అజీర్ణములు నోటిపూతలు భ్రమ (ఒళ్లుతిరుగుట) వాంతి ఎక్కిళ్లు అగ్ని మాంద్యము ఉపశమించును. ॥౩౪॥

## —♦ (21) బాలసూర్యోదయః ♦—

శ్లో॥ ఏకాంశం దరదం రవిప్రియమతో ద్వ్యంశం త్రిభాగం విషం
తుల్యం పర్వతసంభవం శిలమితం చార్ధాంశకం టామరం
శ్యామం సర్వసమం సమీర్య్యృతి మిళిం శ్రీబాలసూర్యోదయం
నానావ్యాధిసమాగతజ్వరక్షయే యుక్తానుపానైర్భజేత్। ॥౩౦॥

రసము ఒక భాగము తామ్రభస్మము వంగభస్మము రెండేసి భాగములు గంధకము నాభి మూడేసి భాగములు అభ్రకము అయిదు భాగములు ఇంగువ అర్ధభాగము మిరియాలు వీటికన్నిటికి సమానము. వీటిని ఏకము చేయవలయును ఇది బాలసూర్యోదయము దీనిని రోగయుక్తానుపానములతో సేవించుచుండిన అన్నివిధములైన రోగములవల్ల పుట్టిన జ్వరములు శాంతినొందును॥

## —♦ (22) ఛేదిజ్వరాంకుశః ♦—

శ్లో॥ ఏకాంశం విషపారదం బలిరథా ద్వ్యంశం చతుర్భాగ్యకం
పంచాంశం మరిచం షడంశమునిశం జాంతాంచ యామద్వయం
మర్ద్యాత్త్రైంహిఫలద్భ్రవై స్త్రజటం చాత్ర రక్తే శోషయే
ద్దద్యా దార్ద్రకనానుపానసహితం ఛేదిజ్వరాంకుశం॥ ॥౩౧॥

నాభి పాదరసము ఒక్కొక్క భాగము గంధకము బలిగాను రెండేసి భాగములు మిరియాలు అయిదు భాగములు జేపాళము ఆరుభాగములు వీటినిముంగ కండ్లరసముతో రెండుయామములు మర్దింపవలయును ఇది ఛేదిజ్వరాంకుశము దీనిని జ్వరపక్వకాలమందు అల్లపురసముతో ఇవ్వవలయును. ॥౩౧॥

## —♦ (23) మాలినీవసంతరసం ♦—

శ్లో॥ రసకయుగళభాగం వేల్లజం చైకభాగం
ద్వితయమపి చ మర్ద్యం వాసరాణాం త్రయేణ।
రుగుచితమనుపానం నింబనీరేణ తావ
జ్జ్వరహర మథ కుర్యా న్మాలినీప్రాగ్వసంతం। ॥౩౨॥

కపురి రెండు భాగములు మిరియాలు ఒక భాగము వీటిని కొండచెక్కరసముతో మూడు దినములు మర్దింపవలెను ఇది మాలినీవసంతము దీనిని తగిన అనుపానములతో సేవించుచుండిన సమస్తవిధములైన జ్వరములు శాంతించును॥ ॥౩౩॥

## —♦ (31) లఘుక్రవ్యాదరసం ♦—

శ్లో॥ ఏకాంశంచ సువర్చలంతు దరదం ద్వ్యంశం మరీచం తథా
టంకం గంధకమేవ తుల్య మనలం శుంఠీలవంగం కణా ।
లోహం మూల మమూని చామ్లజరసై స్సమ్మర్దయే త్సప్తథా
తక్రేణైవ పిబే దజీర్ణహరణం క్రవ్యాదనామౌషధమ్ ॥౪౮॥

సౌవర్చలవణము, పాదరసము ఒక్కొక్కభాగము మిరియాలు, వెలిగారము, గంధకము, చిత్రమూలము, శొంఠి, లవంగాలు, పిప్పళ్ళు, లోహము, పిప్పలిమూలము, రెండేసిభాగములు వీటిని అమ్లద్రవ్యములచే ఏడుభావనలు చేయవలయును. ఇది లఘుక్రవ్యాదరసం. దీనిని మజ్జిగతో సేవించినయెడల సర్వవిధాజీర్ణములు శాంతించును. మాదీఫలము, నిమ్మ, నారదబ్బ, పుల్లప్రబ్బలి, చింత వీటిసముదాయము ఫలపంచామ్లము అనబడును. ॥౪౮॥

## —♦ (౩౨) లఘుచంద్రోదయం ♦—

శ్లో॥ గంధం పారద మభ్రకం గిరిభవం వంగం సమం శైలకం
రంభామూలజలేన యామమియమా త్సమ్మర్దయే ద్యత్నతః ।
పిత్తానేకసమస్తకామిలగదా మేహామయా న్సత్వరం
హన్యా త్సర్వవిధానుపానసహిత శ్చంద్రోదయో మం లఘుః ॥

గంధకము, పాదరసము, అభ్రకము, కర్పూరశిలాజిత్తు, వంగభస్మ, ఏలకులు, సమానభాగములు, వీటిని అరటిదుంపరసముతో ఒకయామము మర్దించవలయును. ఇది లఘుచంద్రోదయము, దీనిని తత్కాలానుకూలానుపానములతో సేవించుటవలన చతుర్వింశతి పైత్యములు, అన్నివిధములైన కామిలారోగములు వింశతి మేహములు, శీఘ్రముగ శాంతినొందును. ॥౪౯॥

## —♦ (౩౩) లఘునారాయణకవచం ♦—

శ్లో॥ రససిందూరమయోఽసరక్తకం త్రిపుకం ధాతులచేవిమర్దితం ।
[illegible]వవఘుస్రం సకలామయాపహం లఘునారాయణ వర్మనామకం॥

రససిందూరము, లోహము, ఇంగిలీకము, తామ్రభస్మము, వంగభస్మము, వీటిని ధాతులసారసముతో తొమ్మిదిరోజులు మర్దించవలయును. ఇది లఘునారాయ

షు. దీని తో మధుపుటు పాకముతో సేవించిన సమస్తవిధములయిన శ్లేష్మ వ్యాధులు శమించును. ||౫౦||

## —♦ (34) లోకనాధరసం ♦—

శ్లో॥ లోకనాధరస మేకభాగకం మాంధురం చ వరటం మరీచకం । ద్వ్యంశకం ఘృతమాలపత్రిజా న్మర్దయే త్సమధునాక్షయాపహం

పాండూరిభస్మము, గవ్వభస్మము ఒక్కొక్క భాగము. మిరియములు, రెండు భాగములు, వీటిని నెయ్యి, తమలపాకులరసము, వీటితో మర్దింపవలయును. ఇది లోకనాధరసము. దీనిని తేనెతో సేవించినయెడల సమస్తవిధములయిన క్షయరోగములు. శమించును. ||౫౧||

## —♦ (35) వసంతకుసుమాకరం ♦—

శ్లో॥ గాంగేయం రజతం ద్విభాగ మురగం కాంతం త్రిపుత్ర్యంశకం
చాతుర్భాగిక మభ్రవిద్రుమరసం ముక్తాఫలానాం రజః ।
గోక్షీరేక్షురసాటరూష కదళీ శ్రీపీతనీరద్వయై
ర్జాజీపద్మసుమద్రవై రపి పృథక్ సప్తక్రమాద్భావయేత్ ।

సువర్ణభస్మము, రజితభస్మము, రెండేసిభాగములు: సీసభస్మము, కాంతలోహము, తగరభస్మము, మూడేసిభాగములు: కృష్ణాభ్రకము. ప్రవాళభస్మము, పాదరసము, ముత్యభస్మము, నాలుగేసిభాగములు: వీటిని ఆవుపాలు, చెరుకురసము, అడ్డసరము. అరటిదుంపరసము, మంచిగంధము, పసుపు, కురువేరు, వట్టివేరు, వీటి కషాయములతోను, మాలతీపుష్పములు, (జాజిపువ్వులు) పద్మములు వీటి రసములతోను ప్రత్యేకప్రత్యేకముగా ఏడేసిమార్లు భావనచేయవలయును. ||౫౨||

శ్లో॥ కస్తూర్యా లఘునా వసంతకుసుమాకరం నామకం ।
సేవే చ్ఛర్కరయా ద్విపల్లవటికాం హన్యాజ్జరాం పాండుతాం ।
శూలోన్మాదవిషప్రయోగసకలతృష్ణాక్షయాఽస్రామయా
న్కాంతా యౌవనగర్వభంగపటుతాం ప్రాప్నోతి తత్సేవకః ॥58

ఇట్లు భావనచేసిన పిమ్మట కస్తూరిని కలపవలయును. ఇది వసంతకుసుమాకరము, దీనిని రెండువల్లములు, పరిణామము, పంచదార అనుపానముతో, సేవించిన యెడల ముదిమి. పాండువు, శూల, ఉన్మాదము, విషప్రయోగజనితదోషము, తృష్ణారోగము, క్షయ, రక్తవ్యాధి, శాంతించును. మరియు దీనిని సేవించినవారు స్త్రీల యౌవనగర్వమును పోగొట్టు సామర్థ్యముకలవారగుదురు. ||౫౩||

—• (38) వాతగజాంకుశః •—

శ్లో॥ అష్టాంశం విషముష్టిగంధకరసం ప్రత్యేకతః కేవలం
త్య్రాంశం చ త్రిఫలం కటుత్రయమిదం జంభాంభసా మర్దయేత్।
నామ్నా వాతగజాంకుశో మునివరై ర్నిర్ధారితోఽయం రసః
వాతాశీతి వినాశనే రుగుచితై ర్యుక్తానుపానై ర్భజేత్ ॥౫౮॥

విషముష్టిగింజలు, గంధకము, పాదరసము వొకటిమిడేసిభాగములు. త్రిఫలము లు. త్రికటువులు మూడేసి భాగములు. వీటిని నిమ్మపండ్లరసముతో నూరిన చేయవల యును. ఇది వాతగజాంకుశము. దీనిని తగు యుక్తానుపానములతో సేవించినయెడల ౮౦ వాతములు శాంతించును. ॥౫౮॥

—• (39) వాతరాక్షసం •—

శ్లో॥ కాంతం గంధకమభ్రకం మృతరసం తామ్రం సమాంశం తథా
వర్షాభూతకటుత్రయాగ్నితులసీభిర్నోష్ణిద్రవాణాం రసైః।
సమ్మర్ద్య త్రిదినం పృథ గ్లఘుపుటం దత్వా పున స్సంచితం
విఖ్యాతం భువి వాతరాక్షస మిదం సర్వానిలోన్మూలనమ్ ॥౫౯॥

కాంతలోహము, గంధకము, అభ్రకభస్మము, రసభస్మము, తామ్రభస్మము, వీటిని తెల్లగలిజేరు, శొంఠి, పిప్పలి, మిరియాలు, చిత్రమూలము, తులసి, తిప్పతీగె వీటియొక్క నిజరసములతో ప్రత్యేకప్రత్యేకముగా మూడేసి రోజులు మర్దనాచేసి పిమ్మట లఘుపుటం బిడవలయును. ఇది వాతరాక్షసము. దీనిని అనుపానవిశేషము లతో సేవించినయెడల సమస్త వాతవ్యాధులు శాంతించును. ॥౫౯॥

—• (40) వాతవిధ్వంసి •—

శ్లో॥ తామ్రాభ్రత్రపునాగగంధమరిచం లోహం రసం టంకణం
షైక్షై కాంత ముదీరితం కటువిషం పార్థం చతుర్భాగకం।
సమ్మర్ద్య త్రిదినం పృథక్పృథగపి క్షుణ్ణా త్రివారం కణా
భూకాశానలనాగరోమణరుజా భృంగద్రవైః తత్పరమ్ ॥ ౬౦ ॥

తామ్రభస్మము. అభ్రకభస్మము, వంగభస్మము, సీసభస్మము, గంధకభస్మము,

టేబ్లెట్స్ సరములనిస్సత్తువకు (28) జెల్ సిరప్ — గర్భిణికి, (29) జైనస్ ఆమేరా జ్వరములకు జీర్ణకోశాస్వస్థతలకు (30) జైస్ రేటెక్ మెగ్నీషియా — అజీర్ణరోగము లకు- శూలకు- (31) జైలహాల్ — బాలింతరోగములకు (32) యార్లోమాల్ట్ ఎక్స్ట్రాక్ట్ బల్లలకు (33) ల్యాక్టోపెప్టైన్ జీర్ణకోశాస్వస్థతలకు చిన్నపిల్లల బలాభి వృద్ధిక (34) లిపిప్రిన్ — ఉబ్బసవ్యాధికి, జలమునకు, (35) విరాల్ చిన్నవయస్సు గలవారిబలాభివృద్ధికి (36) విరోలా — బాలింతరోగములకు (37) వుడ్వర్డ్స్ గ్రైప్ వాటర్ — పారపాలపిల్లల అజీర్ణమునకు,

(38) శానటోజిన్ — బలవర్ధకమునకు (ఆహారసదృశమైనది) (39) శారిడాన్ టేబ్లెట్స్ — తలనొప్పికి, కీళ్ళనొప్పులకు చాలాబాపతులు పోట్లకు, నొప్పులకు, (40) షాల్ మొగ్రా) ఆయల్ — కుష్ఠవ్యాధికి (41) సారసపరిల్లా — రక్తదోషము నకు, చర్మరోగములకు, (42) సిడ్డాల్ ఋతుశూలకు, ఇతరశూలలకు (43) సిలి రీనా — స్త్రీలగర్భాశయరోగములకు (44) సోడామింట్ బిళ్ళలు — శూలలకు, అజీర్ణములకు, (45) హపెటోగ్లోబిన్ సిరప్ — రక్తశుద్ధికి (46) హారంటోన్ టేబ్లెట్స్ — ఋతుశూలలకు (47) హాలీవరాల్ చిన్నవారలనిస్సత్తువకు (48) హిమో గ్లోబిన్ సిరప్ రక్తవృద్ధికి (వాటర్ బరీస్ కాంపౌండ్ సిరప్) (49) హైపోఫాస్ ఫైట్స్ (పొడుము, టేబ్లెట్స్) బలాభివృద్ధికి (50) హశాలిడ్స్ మిక్చర్ (లిక్విడ్) అజీర్తి విరేచనములకు, ఆమవిరేచనములకు మంచిఫలితమును కలిగించెడివి. వివిధములగు ఫార్మసీలయందు యీప్రకరణమున వివరింపబడిన పైమందులును వాటిప్రతినిధులును (సబ్ సిట్యూట్లును) తయారుకాబడుచుండును. అభ్యాసకులు వాటిలోవర్తమానకాల మందు చట్టనిషిద్ధములైన ఓషధులను, ఔషధములను ఖనిజములు మున్నగువాటిని విడిచిపెట్టి వారిఅర్హతలకు వాడతగినమందుల ఫలశ్రుతిని (ఎనాల్ సెస్సును) చక్కగా తెలుసుకొని అభ్యసింపనగును—

శ్లో॥ ఆహారగ్రసనే తమార్గ ద్వారసనాఘ్రాణాఽననాంతర్బిలం ।
బధ్వా సప్తపథాఽగ్రిమానయతి చాఽహారం ప్రహోక్తాఽధ్వన,
ఘ్రాణశ్రోత్రయుగద్వయం చ వదనశ్వాసాఽన్నకో శైకకం
జాత్వన్నే పవమానమార్గగళితే సంకోచతే తద్బిలం॥

ఆహారమును భుజించునప్పుడు కొంచెమైనను మనుష్యునకు గొంతుకకును మధ్యనున్న రంధ్రమును మూసి, ఆహారమును "సప్తపథ" మను పేరుగల అన్న గొట్టముయొక్క మొదటిభాగమునకు చేర్చుచున్నది. సప్తపథకు ముక్కులయొక్కయు చెవులయొక్కయు జంటలనుండి రెండుచొప్పున '4' న్ను నోటినుండియు, ఊపిరి గొట్టములనుండియు, జీర్ణకోశమునుండియు, ఒక్కొక్కటిచొప్పున '3' న్ను వెరసి '7' మార్గములు కలవు. ఒకానొకప్పుడు ఆహారము అన్నగొట్టములోనికి పోవు టకు బదులుగ దైవికమున ఊపిరిగొట్టములోనికి జారినప్పుడు వాయునాళికగొట్ట మన్ను మునుగ్రహించుట కనువుగాక పోవుటచే మాశబడును. అట్టిసమయమున ఆహారము ముక్కులనుండియు, నోటినుండియు, బయటకు వెడలవచ్చును. (ఇదియే పలకమారుట).

శ్లో॥ హాస్యాద్భుక్తౌ భాషణా ద్వోద్గిరంతి
స్పర్శజ్ఞానం చాన్నకోశస్య భూరి।
ఊర్ధ్వాధోధ స్పంతి చగ్మా ణ్యాథస్త
త్వా కస్సర్వతోన్నిక్తి తద్యాతి భుక్తం ॥

భుజించునప్పుడు నవ్వుటవల్లనున్న, అధికముగా మాటలాడుటవల్లనున్న పలకమారుటకు అవకాశమేర్పడును. యీ అన్నవాహికకు స్పర్శజ్ఞాన మత్యధికము. యీ అన్నవాహిక పైభాగమందును, క్రిందిభాగమందును, మధ్యభాగమందును, మూడుపొరలు కలిగియుండును. యీ మూడుపొరలలోను అడుగుపొర ఎల్లప్పుడు స్రవించుచుండుటవలన భుజింపబడిన ఆహారము సులువుగా జీర్ణకోశములోనికి జారి పోవుచున్నది.

శ్లో॥ జీర్ణాశయప్రసరసంకుచకర్మ ణైవ
తత్రత్యపర్వజనితద్రవసంగమేన।
పాకం ప్రపద్య జఠరాశయమీలనేన
మాత్స్మాంత్రసంస్థమధుమాయురసావకీర్ణం ॥

జీర్ణాశయముయొక్క సంకోచప్రసరణములవల్ల పరిపాకమునుపొంది, పిమ్మట జీర్ణాశయము ముకుళించుటచే (కాలాంతరమున) పాకధర్మమునుపొంది, జీర్ణాశయము వంటి మాత్స్మాంత్రముల వ్యాపరించియున్న తిక్త, మధుర, రసములతోనున్న ఆంత్ర రసముతోనున్న ఆహారము మిళితమగును.

శ్లో॥ గర్భాంతర్భవనే విభాజక మితి స్యా దేకకుడ్యాభిదం
తస్యోర్ధ్వాధరభాగయో శ్చ కుహరే హృద్గర్భకోశాభిధే।
హృన్మధ్యే హృదయం ద్విపుప్పుసయుతంశూన్యంచకించి త్తతః
పూర్త్వా చేద్యది పుప్పుసౌ పవనత శ్శూన్యంచ పూర్తంభవేత్॥

గర్భముయొక్క లోపలిభాగమందు, విభాజకము, అనుపేరుగల పలుచని గోడఒకటి గలదు. యీగోడయొక్క పైభాగమునకు హృదయకుహరమనియు, క్రిందిభాగమునకు గర్భకుహరమనియు పేర్లు. హృదయకుహరముయొక్క మధ్యగా రెండువైపులను రెండుఊపిరితిత్తులతో కూడియున్న గుండెకాయకలదు. హృదయ భాగమంతయు వీటితోనే నిండియుండక కొంచెము ఖాళీప్రదేశముకూడా ఉండి యున్నది. ఊపిరితిత్తులుగాలిచే నిండింపబడినప్పుడు ఊపిరితిత్తులుపెద్దవై యీఖాళీప్రదేశమంతా నిండింపబడుచుండును.

శ్లో॥ ఊర్ధ్వాధస్థ బృహత్సిరా సరణినా దుశ్శోణితం కర్ణికాం
గత్వా పుప్పుససంహతిం జఠరికాం శ్వాసాలయే నాళికాః।
తన్నాళీస్థిత శోణితం స్వకలుషం హిత్వా పునస్సత్వరం
ప్రాణస్వీకరణాన్నవాకృతి భవే ద్రక్తం శరీరోచితం॥

స్వభావసిద్ధముగాకలుషమైనరక్తము "ఊర్ధ్వబృహత్సిర" అధోబృహత్సిర" అనుమార్గములద్వారా క్రమముగా గుండెయొక్క కుడికర్ణికలోను, కుడిజఠరికలోను పుప్పుసధమనులలోను, కేశములవంటి శరీరాంతర్గతములైన అల్లికలలోను ప్రవేశించును. ఆ అల్లికలయందంతకు పూర్వమందున్న రక్తము తనయందున్న కలుషపదార్థమును విడిచిపెట్టి తిరిగి ప్రాణవాయువును స్వీకరించుటవలన శుభ్రపడి శరీరమును కాపాడుకొనుటకు తగిన నూతనాకారమును ధరించుచున్నది.

శ్లో॥ కాలేయం ప్రవిశంతి జీర్ణసిరతా మేత్యాంత్రజీర్ణాశయ
వ్యక్తిప్లీహకనాడికా స్తదను సా కాలేయకే జృంభతే।
కుక్షిస్థావయవోత్థ పంకిలమసృ క్ప్రాప్త్యైవ తత్కారిజం
తత్కాలేయసిరాముఖాద్విశతి తత్రాధోబృహన్నాడికాం॥

చిన్నప్రేగులు, పెద్దప్రేగు, జీర్ణాశయము, వృక్కలు, ప్లీహ, వీటియొక్క సిరలుకలసి జీర్ణాశయసిరగామారి కాలేయమును పొందుచున్నది. ఇట్లు యీ జీర్ణాశయసిర కాలేయములందు కేశనాళికలుగా మారిపోవుచున్నది. గాన గర్భకుహరమునందలి అవయవములనుండిబయలుదేరిన కలుషరక్తము ముందుగా కాలేయమును పొంది ఆకాలేయసిరాద్వారా అధోబృహత్సిరను పొందుచున్నది. అనగా అధోబృహత్సిరను పొందుటకుపూర్వము, కాలేయమునందలి కేశనాళికలలో ప్రవేశించి, ఆకేశనాళికలద్వారా బృహత్తమనిశాఖయగు సిరతోకలసి కాలేయప్రధానసిరకుచేరి దానినుండి అధోబృహత్సిరను పొందుచున్నదనట.

శ్లో॥ మహాకాంతివిహీన కాయికకణా రక్తేఽసృజి ప్లీహకం
తద్గుల్మాత్ప్రసృతే ప్రసిత రుధిరే నశ్యంతి జీర్ణాః కణాః।
తత్తజ్జీర్ణకణాఽరుణత్వ మపి తద్గుల్మా దసృగ్వాహకైః
కాలేయం ప్రతిపద్య తత్ర కురుతే పైత్త్యద్రవస్యారుణిం ॥

ప్లీహ ఎఱుపురేని రంగుకణములను రక్తములోనికి పంపుచుండును. పరిశుద్ధమైనరక్తము ఆ ప్లీహలోనుండి ప్రవహించుచుండగా ఆ పరిశుద్ధరక్తమునందు వయస్సుచెల్లినకణములు ప్లీహయందుచిక్కుకొని, అక్కడ కొంతమార్పును పొంది నశించును. ఇట్లునశించిన ఎఱుపుకణములయొక్క రంగుపదార్థము (రక్తిమ) ఆప్లీహనుండి రక్తవాహికలద్వారా కాలేయమునుపొంది అచ్చటతయారగుచున్న పిత్తద్రవమునకు ఎఱుపురంగును కలుగజేయుచున్నది.

శ్లో॥ ఆదాయరక్తాత్కతిచి త్పదార్థా
న్ద్రవత్వ మానీయ తదాంత్రమూలే।
జహాతి తత్రాంత్రముఖాగాన్నసార
పిత్తాన్వితస్యాఽస్య మధుప్రతీతిః ॥

వృక్కకము రక్తములోనుండి కొన్నికొన్నిపదార్థములను గ్రహించి ద్రవస్వరూపముగామార్చి ఆద్రవమును అంత్రమూలమున పోయుచుండును. జీర్ణాశయమునుండియు కాలేయమునుండియు అంత్రమూలమునకు చేరిన అన్నసారముతోను పైత్త్యరసముతోను కలసిన యీద్రవమునకు మధురసమనిపేరు.

శ్లో॥ పిత్తస్తానజరక్తమాధురసికే ప్రాగాంత్రిమూలాగమా
దేకీభూయ తదాంత్రికస్య విపరైక్తిజ్ఞాశయం ప్రాప్యచ।
తజ్జీర్ణాశయ పాకగాఽప్లగుణితాం వ్యాత్యాఽఙ్కిలం కుర్వతః
పిత్తంమాధురసంయుతం యదిభవేత్స్నిగ్ధంవసాం జీర్ణయేత్ ॥

పిత్తాశయమునుండి బయలుదేరిన పిత్తవాహికయు, మధురవాహికయు, అంత్రమూలమునందు ప్రవేశించకపూర్వమునందు ఒకటిగాకలిసిపోయి, అంత్రమూలపు గోడలనుండి జీర్ణాశయమునుపొంది, పుల్లదనమునువహించి అంతకుపూర్వమే అక్కడ నున్న పాక రసమును ఉప్పగా మార్చివేయును. కేవలపిత్తరసము పిండిపదార్థములమీదగానికొవ్వు (చమురు) పదార్థముల మీదగాని పని చేయజాలదు. పిత్తరసము మధురరసముతో కలిసినప్పడే పిండిపదార్థములను కొవ్వుపదార్థములను జీర్ణము చేయు ననుట.

శ్లో॥ సుజీర్ణితాహారరసావశిష్టం నిరం చ దేహానుపయోగభూతం।
ఘనాంత్రి మాకర్షతి తత్రి నీరవ్యయేన కిట్టంబహి రేత్యధస్తాత్ ॥

జీర్ణమైన పదార్థములలో మిగిలినట్టియు, శరీరమున కుపయోగము కానట్టియు పదార్థమునున్న నీటినిన్ని పెద్దపేగు గ్రహించును. అట్లు గ్రహింపబడిన పదార్థమందలి జలభాగమంతయు మూత్రపిండములోనికి మారి మిగిలిన పిప్పి యీ పెద్దపేగు ద్వారా అధోముఖమున బయలువెడలును.

శ్లో॥ ఆంత్రిగ్రంథిషు నాళికాస్సురమితా శృంగాఖ్యకా ధాతుపా
భుక్తా క్షీరసమావసా ఽస్రసహితా తచ్ఛృంగదుగ్ధభ్రమే।
మాష్యం శోషరసం సధాతుపరసం వ్యష్టాస్విపార్శ్వా దసః
క్షీరోద్వాహముఖా త్సిరాం ప్రవిశతే కంఠాపసవ్యస్థితాం ॥

చిన్నపేగులలోకిక్కిరిసిన కోట్లకొలది గ్రంథులు గలవు. వీటికి శృంగకము లనియు, ధాతుపవాహిక లనియు పేరు. భుజింపబడిన పాకమునందలి పాలవంటి కొవ్వుపదార్థము రక్తముతో కలసి శృంగకముల (ధాతుపవాహికల) మధ్య నున్న పాలగొట్టములలో చేరును. పనిచేయు అవయవములనుండి బయలుదేరు మలినమైన శోషరసము వెనుక చెప్పబడిన కొవ్వుపదార్థముతో కూడుకొని వెన్నెముకకు ప్రక్కగానున్న రసక్షీరవాహిని యనబడు పెద్దసిరాముఖమునుండి మెడకు ఎడమ భాగమందున్న సిరలో ప్రవేశించును.

శ్లో॥ ముఖ్యః ప్రాణమరు త్తథైవ సలిలం జీర్ణం విధాయాऽశితం
రక్తే మిశ్రగుణం కరోతి వపుష స్స్యా త్సప్తతి ర్భాగవే|
రక్తేऽశీతి రభూ త్తతస్య సలిలం రక్తస్య కాంతిప్రదం
రక్తాద్రివ్యవిసర్జనే చ కురుతే శశ్వత్సహాయం తథా||

తా॥ ప్రాణవాయువువలెనే జలమున్ను శరీరమునకు అవసరములచేతను ముఖ్యమైయున్నది. యీజలము ఆహారపదార్థమును జీర్ణింపచేసి జీర్ణమైన యీఆహార రసమును రక్తములో కలుపుచున్నది. యీజలము శరీరముయొక్క బరువులో నూటికి (70) పాళ్ళున్ను రక్తములో నూటికి 80 పాళ్ళున్ను యుండును. మరియు రక్తమునకు కాంతిని కలుగజేయుటయే గాక శరీరమునందలి వ్యర్థపదార్థమును తొలగించుట యందు సహాయమును చేయును.

శ్లో॥ నాడీకందరమండలైః ప్రచలనం వక్త్రాంత్రజీర్ణాశయై
ర్జీర్ణం జీర్ణరసప్రసార మసృజి ఘ్రాణాంగహృత్ఫుప్ఫుసైః|
శ్వాసం ఫుప్ఫుసచర్మమూత్రధిబహిష్కారం హృదస్రయన్త్రై
రసప్రంపోషణవస్తురక్తసరణిం సర్వే స్వకృత్యోత్తమాః||

తా॥ నాడీమండలమున్ను కండరములున్ను శరీరావయవములనుచలింపజేయును. నోరు, పేగులు, జీర్ణాశయము ఇవి జీర్ణమండలము యీమండలము ఆహారమును జీర్ణింపచేసి జీర్ణమయిన ఆహారద్రవమును రక్తమునందు కలియునట్లు చేయును. ముక్కుగొట్టములు, ఊపిరితిత్తులు ఇవి శ్వాసమండలము. ఇది రక్తమునకు మంచిగాలి నిచ్చి చెడుగాలిని నశింపజేయును. ఊపిరితిత్తులు, చర్మము, మూత్రపిండములు ఇది బహిష్కారకమండలము. ఇది శరీరమున తయారయిన పదార్థమును వెడలించును. గుండెకాయ రక్తనాళములు ఇది రక్తప్రసరణమండలము. ఇది ప్రతిఅవయవమునకు రక్తమును, పోషణపదార్థమును ప్రసరింపచేయును.

శ్లో॥ ఏవం యంత్రసమం పృథగ్గ్రసతి తత్ప్రాణానిలం చాశనం
సద్యస్త ద్ద్వయమేళనేన తపనం శక్తిః ప్రతీకేऽసృజి|
లుప్తా న్పూరయతే బహిశ్చ్యవయతే వ్యర్థా న్తథా శ్వాసతోం
గారత్సౌరమరు జ్జలోష్మమలినం మూత్రాశయాంతర్గతైః||

తా॥ యీప్రకారము యంత్రముతో పోల్చదగిన మానవదేహము గాలిలో నుండి ప్రాణవాయువును వేరుగాను, ఆహారమును వేరుగాను స్వీకరించును. ఈ ప్రాణవాయువు యొక్కయు ఆహారముయొక్కయు సమ్మేళనమువలన వేడిమి (తను కాక) శక్తియు, కలుగుటయేగాక శరీరమునందును, రక్తమునందును శిథిలములైన భాగములు పూర్తి కాబడుచు ఊపిరితిత్తులవల్ల అంగారక్షారవాయువున్ను (బొగ్గు పులుసుగాలియు) నీటి ఆవిరియు మూత్రపిండములవలన నీరున్ను, మరికొన్ని పదార్థములున్ను పేగులవల్ల జీర్ణముకాగా మిగిలిపోయిన పనికిమాలిన పదార్థమున్ను చర్మమువల్ల చమటయు విడిచిపెట్టబడుచుండును.

## — ♦ వాతస్వరూపము ♦ —

శ్లో॥ పవనో బలవా న్సూక్ష్మ శ్శీతో రూక్షో లఘు శ్చలః ।
రజోగుణమయో నేతా విభాగకరణం చ [illegible] ।

వాతము, బలము, సూక్ష్మము, చల్లదనము, రూక్షత్వము, (పరుషత్వము) తేలిక, కదలిక, రజోగుణము, ఆధిపత్యము, ఇవి కలదై పదార్థవిభాగమును చేయును.

## — ♦ పిత్తస్వరూపము ♦ —

శ్లో॥ పిత్త ముష్ణం ద్రవం పీతం నీలం సత్వగుణాత్మకం ।
కటుతిక్త రసోపేతం విదగ్ధం చామ్లతాం వ్రజేత్ ॥

పిత్తము, ఉష్ణము, ద్రవము, పచ్చదనము, నలుపు, సత్వగుణము, కటు, తిక్త, రసము, ఇవి కలదై పదార్థములచే విదగ్ధ మగుచు పుల్లతనమును పొందును.

## — ♦ శ్లేష్మస్వరూపము ♦ —

శ్లో॥ కఫస్స్నిగ్ధో గురు శ్శ్వేతః పిచ్ఛిల శ్శీతల స్తథా ।
తమోగుణాత్మక స్స్వాదు ర్విదగ్ధో లవణో భవేత్ ॥

కఫము, స్నిగ్ధము, బరువు, తెలుపు, బంక చల్లదనము, తమోగుణము, తీపి, ఇవి కలదై పదార్థములచే విదగ్ధ మగుచు ఉప్పతనమును పొందును.

## — ♦ వాతచర్య ♦ —

శ్లో॥ శీతరూక్షాంగరుక్చేష్టానాశశ్యామసుషు ప్తయః ।
శోషాసంకోచపారుష్యశూలావాతభవా గుణాః ॥

శైత్యము, రూక్షత్వము, ఒడలు ఒరువు, కదలలేకుండుట, నల్లపడుట, నిద్ర, శోష కలుగుట, సంకోచము, పారుష్యము, శూల, ఇవి వాతముయొక్క చిహ్నలు.

## — ♦ పిత్తచర్య ♦ —

శ్లో॥ తాపాఽస్యపాకదుర్గంధక్లేశదాహారుణభ్రమాః ।
పరిశ్రమస్వేదశోకమూర్ఛాః పిత్తభవా గుణాః ॥

తాపము, నోరెండుట, దుర్వాసన, శరీరము తడిసినట్లుండుట, దాహము, ఎరుపుపారుట, భ్రమ, ఆయాసము చెమట, దప్పిక, మూర్ఛ, ఇది పిత్తముయొక్క చిహ్నములు.

శ్లో॥ చిరక్రియో త్సేదసీతలేపపిచ్ఛిలపాండవః।
కండూపదేహా స్నేహాంగభారాశ్లేష్మభవా గుణాః॥

తా॥ పనియం దలసత్వము, వాపు, చల్లదనము, నునుపు, బంక, తెలుపు పారుట, మరద, బద్ధకము, శరీరము జిడ్డుగ నుండుట, ఒడలు బరువు, ఇవి శ్లేష్మముయొక్క చిహ్నములు.

## — ♦పంచమహాభూతగుణములు♦ —

శ్లో॥ శబ్ద స్స్పర్శ శ్చ రూపం చ రసో గంధః పరాగుణాః।
పునస్తే ఖాఽనిలాగ్న్యంబుభువ స్త్వేకగుణాధికాః॥

తా॥ (ప్రతిలోమక్రమముగా) ఆకాశమునకు శబ్దము వాయువునకు స్పర్శము అగ్నికి రూపము జలమునకు రసము భూమికి గంధము ప్రధానగుణములు. మరియు ఆకాశమునకు శబ్దము, వాయువునకు శబ్దస్పర్శములు, అగ్నికి శబ్దస్పర్శరూపములు, జలమునకు శబ్దస్పర్శరూపరసములు, భూమికి శబ్దస్పర్శరూపరసగంధములు. ఇట్లు ఒక్కొక్కగుణము అధికముగా కలవి అని తెలియ నగును.

శ్లో॥ గురుమందహిమస్నిగ్ధశ్లక్ష్ణసాంద్రమృదుస్థిరాః!
గుణా స్ససూక్ష్మవిశదా వింశతి స్సవిపర్యయాః॥

తా॥ బరువు, తేలిక, మాంద్యము, తైక్ష్ణ్యము, శైత్యము, ఉష్ణత్వము, స్నిగ్ధత్వము, రూక్షత్వము, మసృణత్వము (నునుపు) పరుసుదనము, సాంద్రత్వము ద్రవత్వము మృదుత్వము, కాఠిన్యము, స్థిరత్వము, ప్లవత్వము, సూక్ష్మత్వము, స్థాల్యము, స్వచ్ఛత్వము, జిడ్డు అనునవి '20' గుణములు. ఇవి అవిరుద్ధములై యథోచితముగ ద్రవ్యాశ్రితములై యుండును.

శ్లో॥ "లఘుతీక్ష్ణోష్ణరూక్షాశ్చ ఖరద్రవదృఢప్లవాః।
అమీ సస్థూలవిజలా గుణప్రతిగుణాః క్రమాత్ ॥

ఇతి శ్రీ చిత్రాంగదసంగ్రహాఖ్యే శ్రీసోమయాజి సత్ప్రథే
సత్ప్రథప్రకరణేషు వర్ణాంగదప్రకరణమ్.



# చిత్రాగదసంగ్రహాఖ్యే
# శ్రీసోమయాజిసత్పథే
## సంకీర్ణప్రకరణమ్.



శ్లో॥ యద్వ్యాధి దేహస్థితిమూల మేవ
త్రిదోషపంచాత్మకసప్తధాతు।
గుణత్రయం చాత్రవికారకర్తృ
తద్వర్ణ్య సౌఖ్యోచితసూక్ష్మయోగాః॥

తా॥ దేవ మనుష్యులకు. మూలకారణమైన యీశరీరము వాతపిత్తశ్లేష్మములను త్రిదోషములు, పృథివ్యప్తేజోవాయ్వాకాశములను పంచభూతములు, రసరక్తమాంసమేదోమజ్జాస్థిశుక్రములను సప్తధాతువులు, సత్వరజస్తమోగుణములను మూడు గుణములు కలిగి వివిధములైన రోగవికారములకును, మలమూత్రస్వేదాదులకును స్థాన మగుచున్నదో అట్టి శరీరముయొక్క సుఖస్థితి కనుకూలమైన సులభక్రియలు చెప్పబడుచున్నవి.

### — ♦ ఓషధివీర్యకాలము ♦ —

శ్లో॥ చూర్ణానిమాసద్వయ మేవ తైల ఘృతానిచతుష్టక మేకవర్షం।
వనస్పతి శ్చౌషధిలేహ్యమాత్రి రసాయనం భస్మ పురాతనం చ॥

తా॥ చూర్ణములు రెండుమాసములు. తైలములు, ఘృతములు నాలుగుమాసములు, వనస్పతులు (పుష్పములవలన పుట్టిన ఫలములు గల మామిడి మొదలగునవి) ఓషధులు, (పువ్వులు లేకుండా ఫలించెడు మేడి. పనస మొదలైనవి) లేహ్యములు మాత్రలు (కజ్జలిసంబంధములు గాని గుటికలు లేక కుప్పెలు) వక సంవత్సరము. రసాయనములు (వంటకౌషధములు) భస్మములు (లోహసంబంధములు, పాతిసంబంధములు) ఇవి పాతగిలినకొలది ప్రశస్తములు.

శ్లో॥ భద్రాజ్యోషణచిత్రతండులగుడ క్షౌద్రం పురాణం వగం
త్వక్పత్రాదివివిగ్నవే త్వన దితే మూలం తదా గృహ్యతాం॥
శ్యామ్యా సింహముఖీ విదారి తుంగీ కాళీ గన్ధై రేయుక
బ్రహ్మత్వక్ప్రతీసకీ ప్రసరణీ మార్గాం సదా యోజయేత్॥

తా॥ ధనియాలు, నెయ్యి, పిప్పళ్ళు, వాయువిడంగాలు, బెల్లము, తేనె, ఇవి (గతసాలవి. అనగా పుచ్చిపోకుండాను వాసన రకుండాను ఉన్నంతవరకు ఉంచినవి) ప్రశస్తములు. చర్మము. ఆకులు. మొదలైనవాటి వివక్ష చెప్పని స్థలమందు వేళ్ళపై చర్మమును గ్రహింపవలెను. తిప్పతీగె. అడ్డసరము, నేలగుమ్ముడు, పెన్నేరు, కొడిశపాల, ములుగోరింట, పెద్దసదాప, పిల్లితేగలు, గాంతెమగొమరు, ఇవి పచ్చివి ప్రశస్తములు (పచ్చివి ఎండినవెంటనే వాడుట మంచిది)

— ♦ పత్రసారములు ♦ —

శ్లో॥ భృంగాస్ఫోటఝటాపటోలకితవక్షుద్రామ్లికారాక్షసీ।
తాంబూలీవిజయావిపాదిసుషవీ మత్స్యాక్షీ విష్ణుప్రియా।
బ్రహ్మాద్యాః ప్రభవంతి పత్రబలినః॥

తా॥ గుంటగలగ, జిల్లేడు. నేలవుశిరిక. పొట్ల, ఉమ్మెత్త, పులిచింత బచ్చలి తులసి, తమలపాకు, గంజాయి, హంసపాది, కాకర, పొన్నగంటి, విష్ణుకాంత, సరస్వతీఆకు. మొదలయినవి పత్రసారములు (ఆకులు ప్రధానములుగాగల వగుట).

— ♦ దారుత్వక్సారములు ♦ —

పాలాశరోగాపహా।
శ్రీమాన్జంబుబలాకలోధ్రకుటజా స్స్కంధాజిన శ్శిగ్రినః।

తా॥ మోదుగు, రేల, రావి, నేరేడు, బలుసు, లొద్దుగు, కొడిశపాల ఇవి మానుపైనుండు తొక్కలు సారముగా గలవి.

— ♦ కందసారములు ♦ —

శ్లో॥ రాస్నాకుష్ఠకచోరముస్తరజనీమంజిష్ఠశుక్లాఽమ్లికా
మూర్వాలాంగలిశారిబాశతపదీకుంభావిదూపానచాః।
అశ్వాక్షేపజనాగమస్తనటిభూతాళాఽటవీసూరణా
భైషజ్యాగమసంప్రదాయసరణే స్స్యుః కందసారా అమీ॥

తా॥ రాస్న, ఉంగిల్నకోష్ఠు, కచ్చూరాలు, తుంగముస్తలు, పసుపు, మంజిష్ఠ, నేలగుమ్ముడు, పుల్లజవ్వాది, చాగ, చన్నచన్నగక్క, సుగంధపాల, కిల్లితేగలు, తెగడ, అతివస, వస, పెన్నేరు, అల్లము, నాగముస్తలు, మంచిలము , నేలతాడి, అడవికంద, (పాతకుంపాదానంతెలు ఉడి పడి మొలచినది) ఇవి మంపలు సారముగా కలవి

—♦ మూలసారములు ♦—

శ్లో॥ రోదస్స్యాంశుమతీద్వయాఽభయకటా క్షుద్రా బలాపంచకం।
పాఠాబర్బరకుండలీద్వయపునర్భూమూలసారాన్వితాః॥

తా॥ ములగ, కోలపొన్న, ముయ్యాకు పొన్న. కరువేరు, మూలగుంట, వాకుడు. బలాపంచకము (అతిబల, మహాబల, నాగబల, జటిలిక. పేరాముట్టి) విష బొద్ది, వాయింట, తెల్లవుష్పి నల్లవుష్పి, గలిజేరు, ఇవి వేరు సారముగా కలవి.

—♦ బీజసారములు ♦—

మాషవ్రీహితిలైలసర్షపముఖాబీజప్రధానాః

తా॥ మినుగులు, ధాన్యము, నువ్వులు, ఏలకులు, ఆవాలు, మొదలైనవి బీజములు ప్రధానములుగా గలవి.

—♦ ఫలసారములు ♦—

ఫల। శ్రేష్ఠా దాడిమపూగతాళపనసద్రాక్షాకపిత్థాదయః॥

తా॥ దానిమ్మ, పోక, తాడి, పనస, ద్రాక్ష, వెలగ మొదలైనవి ఫలములు ప్రధానములుగా గలవి.

—♦ సారసారములు ♦—

శ్లో॥ శ్రీఖండాఽగరుదారుయష్టిమధురాఽద్యాః స్సారసారాః

మంచిగంధము, అగరు, దేవదారు, చంద్ర, అతిమధురము, మొదలయినవి, లోపలనుండు చావ సారముగా గలవి.

—♦ క్షీరసారము ♦—

పయః। స్నాసా సౌఖ్యవిరేచనీ బహుపయ ।
స్సూర్యాబ్జయోని స్నుహీ ॥

అతుచెముడు, చెముడు. జల్లేడు, బ్రహ్మచెముడు, మొదలయినవి పాలు సార ముగా కలవి.

— ♦ నిర్యాససారములు ♦ —

నిర్యాసాతిబలా స్సువర్ణతరు శైలూషా౽రిమేదాదయో ॥

రేల, మారేడు, తుమ్మ, వేప, నల్లమంద, మొదలయినవి జిగురు సారముగా గలవి.

— ♦ సర్వాంగసారములు ♦ —

భూనింబా౽సిత పర్పటా౽బలముఖా ।

స్సర్వాంగసారా స్స్మృతాః ॥

శేలవేము, గుంటగలగర, పర్పటకము, కలబంద, మొదలైనవి సర్వాంగ ములు సారముగా గలవి.

— ♦ పుష్పసారములు ♦ —

శ్లో॥ జాతీచంపకసింధువార వకుళా౽శోకోచ్చటా కేతకీ ।

పున్నాగాష్టః దీమహాసహా పరివ్యాధావదంశతమాః

నంద్యావర్తసరోజపాటలముఖాః పుష్పప్రధానా అమీ ॥

జాజి, సంపెంగ, వావిలి, పొగడ, అశోకము, గురివింద, మొగలి, పొన్న, మల్లి, చామంతి, రేల, మునగ, నందివర్ధనము, తామర, కలిగొట్టు, మొదలయినవి పుష్పములు సారముగా గలవి.

— ♦ క్షారసారములు ♦ —

వాసాచవ్యపునర్నవాతిలయవాద్యాః క్షారసారా స్స్మృతాః ।

అడ్డసరము, చవ్యము, గలిజేరు, నువ్వు, వాము, మొదలయినవి క్షారము (కాల్చిన బూడిది) సారముగా గలవి.

— ♦ సామాన్యనియమము ♦ —

శ్లో॥ ముద్గాఢకాదీ స్సతుషా న్కషాయే ।

చూర్ణే ప్రదద్యా ద్విదుషా నజస్రం

త్వక్పత్రమూలాఙ్కురపల్లవేషు మూలం
ప్రాజ్యమారోహేషు చ గన్ధమేవ !

పెసలు, కందులు మొదలైన ధాన్యములను కషాయములలో పైపొట్టు తోనున్ను. చూర్ణములలో పైపొట్టుతీసివేసిన్ని ప్రయోగింపవలయును. బెరడు, ఆకులు, వేరు, పువ్వు, చావ, చిగురు, పాలు, మొదలైనవాటియొక్క వివరణ, చెయ్యబడని స్థలమందు వేళ్ళనున్ను, పాలు నెయ్యి మొదలైనవాటియొక్క వివరణ చెయ్యబడనిస్థలమందు ఆవుపాలు, ఆవునెయ్యి, ఆవుపంచితము వీటినే గ్రహింపవలయును.

## —♦ ఔషధపాత్రస్థానము ♦—

శ్లో॥ ఆయాంతి భుక్తౌషధశేషతత్పరాః
పునః పునర్వ్యాధ్యధిదేవతాస్తతః
పాత్రం న్యసేద్వామతలే త్వధోముఖం
జాయన్ విరోగో పవిశేన్ముహూర్తతః ॥

రోగాధిష్ఠానదేవతలు రోగిపుచ్చుకొనగా మిగిలిన ఔషధశేషమునందాసక్తి కలవారై వచ్చెదరు గాన రోగి ఔషధమును పుచ్చుకొన్నపిదప ఆపాత్రను తన యెడమవైపున బోర్లించవలయును. రోగి ఔషధమును పుచ్చుకొనిన తర్వాత ఆ ఔషధముతన శరీరమునందిముడువరకు క్షణమాత్రము కూర్చుండవలయును.

## —♦ అసహ్యప్రతీకారము ♦—

శ్లో॥ లాజం పూగం నాగవల్లీదళం వా
ఖాదన్ స్విన్నే వక్త్రశుద్ధ్యై హి మేష
గండూషం తృడ్వారణాయోదకేన
క్వాథం పేయం కోష్ణమేవామయేషు ॥

మందుపుచ్చుకొనిన అసహ్యము పోవుకొరకు పేలపుగింజలనుగాని పోకచక్క ముక్కను గాని, తమలపాకునుగాని, నమలి మ్రింగకుండా ఉమియవలెను. మందు పుచ్చుకున్న వెంటనే కలిగిన దాహశాంతికొరకు చల్లటి నీళ్ళను పుక్కిలించి ఉమియవలెను. రోగులుపుచ్చుకొను కషాయము గోరువెచ్చగా నుండవలయును.

## — ఉపశయవివరణము —

శ్లో॥ హేతువ్యాధ్యుభయాత్మభిన్నవవిధం స్యా ద్విపరీతాన్వితం।
జాయన్త్యాహారవిహార మేవ చ పున స్తద్విపరీతార్థకృత్
వాతశ్లేష్మభవజ్వరాదిషు భవే చ్ఛుంఠీ శ్రమోత్థజ్వరే
మాంసాహారనిషేవణం చ దివసస్వాపే నిశాజాగరః ॥

తా॥ ఔషధాహారవిహారములు క్రమముగా హేతువ్యాధ్యుభయాత్మకవిపరీతభేదములచే '9' విధములున్ను తద్విపరీతార్థకరభేదములచే '9' విధములున్ను మొత్తము మీద '18' విధములు అగుచున్నవి. ఎట్లన, వాతశ్లేష్మజనితజ్వరాదులయందు తద్విరుద్ధమైన వేడిగుణముగల శొంఠిని ప్రయోగించుట (1) హేతువిపరీతౌషధము. శ్రమజనితజ్వరాదులయందు శ్రమహరమైన మాంసాద్యాహారము (2) హేతువిపరీతాహారము. పగటిభాగమందు నిద్రించుటచే గలిగిన బడలికయందు రాత్రి మేలుకొనుట. రాత్రి మేలుకొనుటచే కలిగిన బడలికయందు పగలునిద్రించుట. (3) హేతువిపరీతవిహారము, ఇయ్యవి హేతువిపరీతౌషధాహారవిహారములు.

శ్లో॥ సారే దీపనికామసూర మపి చోదావర్తకే ప్రహ్వాణం
శంశోషే దశమూలకం కఫమరుజ్జాతగ్రహణ్యాం దధి।
స్నిగ్ధాహారదివాసుషుప్తి బుగుజి స్యా జ్జాగరః పిత్తపం
జాతే ర్మే జ్వలనోపనాహగిళితం వాతభ్రమే భీషణం॥

తా॥ అతిసారమునందు దోషమును లెక్కజేయక తనప్రభావముచే వ్యాధిని తొలగించుసామర్థ్యముగల చిరుబొద్ది. (4) వ్యాధివిపరీతౌషధము, అతిసారనిరోధకమైన చిరుశనగలు. (5) వ్యాధివిపరీతాహారము, ఉదావర్తవ్యాధియందు ముక్కుట. (6) వ్యాధివిపరీతవిహారము. ఇయ్యది వ్యాధివిపరీతౌషధాహారవిహారములు.

వాతజనితశోషయందు వాతశోషహరమైన దశమూలప్రయోగము. (7) హేతువ్యాధివిపరీతౌషధము. కఫవాతజనితగ్రహణీరోగమునందు పెరుగు. (8) హేతువ్యాధివిపరీతాహారము. గురుత్వపదార్థభక్షణము, పగటినిద్ర వీటిచే జనించిన బడలికయందు రాత్రిజాగరణము (9) హేతువ్యాధివిపరీతవిహారము. ఇయ్యవి హేతువ్యాధివిపరీతౌషధాహారవిహారములు. పిత్తజనితవ్రణమునందు ఉష్ణవీర్యము గల ద్రవ్యమును కట్టుకట్టుట. (10) హేతువిపరీతార్థకరౌషధము. ఉష్ణవీర్యముగల పదార్థభక్షణము(11)

హేతువిపరీతార్థకరాహారము. వాతజనితోన్మాదమునందు వాతమును పెంపొందించు భయమును కలుగజేయుట '12' హేతువిపరీతార్థకరవిహారము. ఇయ్యవి హేతువిపరీతార్థకరౌషధాహారవిహారములు.

శ్లో॥ వాంతౌ చే త్సురహాటకం విషి పయోఽప్యుష్ణం గుల్మే వేశనా।
దగ్ధే చాగరుయోజనా మదగదే మద్యం జడే చాలనం।
వాంతాద్యా కరహాటకాదిషు రుజా సంవర్ధకారి వ్యపి
స్వీయేనైవ బలేన హేతువిషమం కుర్వంతి రుగ్వారణం ॥

తా॥ అజీర్ణజనితవమనములయందు వాంతిజనకమైన మ్రంగకాయ (13) వ్యాధివిపరీతార్థకరౌషధము. విరేచనవ్యాధియందు విరేచనకారియగు పాలను త్రాగుట (14) వ్యాధివిపరీతార్థకరాహారము. అజీర్ణవికారమునందు (గుండించుచున్నప్పుడు) చేతివేళ్ళను గొంతుకలోనికి పోనిచ్చి డోకు రప్పించుకొనుట (15) వ్యాధివిపరీతార్థకరవిహారము. ఇయ్యవి వ్యాధివిపరీతార్థకరౌషధాహారవిహారములు.

కాలినపుండుయందు ఉష్ణగుణప్రధానమైన అగరును పట్టించుట (16) హేతువ్యాధివిపరీతార్థకరౌషధము. మద్యపానజనిత (మదాత్యయ) వ్యాధియందు మద్యపానము (17) హేతువ్యాధివిపరీతార్థకరాహారము. కదలలేకుండు వాతవ్యాధియందు అవయవములను సాగతీయుట ముడుచుట నడిపించుట మొదలైనచలనము (18) హేతువ్యాధివిపరీతార్థకరవిహారము. ఇయ్యవి హేతువ్యాధివిపరీతార్థకరౌషధాహారవిహారములు.

వమనాదులయందు మ్రంగకాయ మొదలైనవి రోగమును పెంపొందించు స్వభావముగలవైనను తమ తమ ప్రభావమువలన, హేత్వాదులకు వ్యతిరేకముగా (రోగప్రకోపమునకు బదులుగా) రోగోపశాంతిని కలుగజేయుచున్నవి. రోగలక్షణములు పూర్తిగా కాని, స్పష్టముగా కాని, కానరాక వాతాదిదోషనిర్ణయావకాశము లేకుండునపుడు యీయుపశయము రోగజ్ఞానసాధన మగును.

శ్లో॥ అపి యది వస్తుసమాశ్రితాః స్వయం
రసగుణవీర్యవిపాకసామకాః
నిజగతవస్తువశంవిహ్యాత్య తే
స్వసహజకర్మ చరంతి చ క్వచిత్ ॥

తా. పరిభాషాప్రకరణమున చెప్పబడిన "స్వాదేవమధ్వారసః" అను శ్లోకోక్తమధురామ్లలవణకటుకషాయతిక్తరసములు, గురుత్వలఘుత్వగుణములు ఉష్ణశైత్యవీర్యములు, మధురఅమ్లకటుపాకములు అనునవి ద్రవ్యాశ్రయములైనప్పటికిన్ని దానిని విడచి ఒక్కొక్కప్పుడు స్వతంత్రముగానే (తమంతట తాము) తమతమ కార్యమును నెరవేర్చుకొనుచున్నవి.

శ్లో|| భుక్తం షడ్రసయుక్త మాత్మశుచిసంయోగా త్త్రిధా పచ్యతే।
తత్రాఽక్షీబమధుద్వయంతుమధుతామామ్లోఽమ్లతాంతత్త్రయం
యాత్యేవం కటుతా తతస్తు మధురా చ్ఛ్లేష్మాఽమ్లపాకాచ్ఛుచి
ర్వాత స్స్యా త్కటుకా ద్గుణత్రయయుతం పిత్తానిలశ్లేష్మకం ||

షడ్రసోపేతమైన అన్నాదికము జఠరాగ్నిసంయోగముచే మూడు రకములుగా మారుచున్నది. ఎట్లనగా లవణమధురసములు రెండున్ను మధురసముగాను, అమ్లరసము అమ్లరసముగాను కటుకషాయతిక్తరసములు మూడున్ను కటురసముగాను పరిపాకమును పొందుచున్నవి. వీటిలో మధురరసమువలన శ్లేష్మమును అమ్లరసమువలన పిత్తమును కటురసమువలన వాతమును జనించును పిత్తవాతశ్లేష్మములు క్రమముగా సత్త్వరజస్తమోగుణములు కలవి.

శ్లో|| రుగ్లక్షణాన్యప్రతిపాదితాని ।
క్రియాచయత్రాఽప్రతిపాదితాఽత్ర
గ్రంథోక్తతత్తద్గదజాయులింగై
ర్వ్యాధిక్రియాజ్ఞాన ముపార్జితవ్యం ||

యీప్రకరణమునం దెక్కడెక్కడ రోగలక్షణములుగాని రోగోపశాంతికి మందులుగాని తెలుపబడవో అక్కడ ఆయాప్రకరణములయందు చెప్పబడిన రోగలక్షణములు ఔషధగుణములు మొదలైనవాటిచే వ్యాధులను గుర్తించుట, చికిత్సల నూహించుట, అవసరమని తెలియ నగును.

శ్లో|| వైద్యానపేక్షోపశమస్వభావాః కేచి చ్చికిత్సానుపశాంతిరూపాః।
వైద్యస్యసీమద్వయమస్తి చైవంతద్భిన్నరోగాస్సతతంక్రియార్హాః

చికిత్స అవసరములేకుండ వాటంతట అవియే తగ్గు స్వభావముగల వ్యాధులు కొన్ని యోగ్యమైన చికిత్స చేసినను తగ్గనిస్వభావము కల వ్యాధులు కొన్ని యీరీ

(11) గోరింటవేళ్ళ పైబెరడులో పసుపువేసి నూరి ఆముక్త కట్టినయెడల సిస్. శ్లోకో
త్వరలో నయమగును.

అంగల్లిక— చిన్నపిల్లలకు శరీరమందు ఏదోయొకభాగమందు, పెసలవంటి కురుపులు బయలుదేరి నిగనిగలాడుచు నొప్పిలేక గుండ్రముగా నుండును.

అజీర్ణము — భుజించబడిన ఆహారము జీర్ణము కాకుండుట

అతిమూత్రము— మూత్రము బరువుగాను, తీపిగాను (శ్వేతధాతువుతోను) ఉండువ్యాధి ఒకటియున్ను, శ్వేతధాతువుకూడా లేకుండా మూత్ర మెక్కువ పరిమాణముగాగాని, అనేకసార్లుగాగాని వెడలెడువ్యాధి ఒకటియు, రెండువిధములు.

(1) నల్లమందు అలవాటు చేసుకొన్నచో వెంటనే రక్తము చేదక్కి వ్యాధి నివారణ కాగలదు. యీ నల్లమందును చంద్రోదయంతో గాని, వసంతకుసుమాకరంతో గాని కలిపి సేవింపవచ్చును. నల్లమందువలన విరేచనబదం కలుగుతుందని సందేహిస్తే యీ వ్యాధి కుదరదు. యీవ్యాధికి నల్లమందుతో సరిగా పనిచేసే మందు యింకొకటి కనుపించదు నల్లమందు మానకుండా వేసుకున్న యెడల విరేచనం సాఫీలో పడగలదు. కొంతమంది చిన్నపిల్లలకు పదిసంత్సరాలు వయస్సు వచ్చేవరకు పక్కలో మూత్రమునువిడుచు బాధ కలిగియుండును విడువకుండా రెండుమాసములు రాత్రి పరుండబోవునప్పుడు కొంచెము నల్లమందు వేయుచుండుటవలన యీ వ్యాధి పూర్తిగా తగ్గును.

(2) వేపచక్కచూర్ణం రెండుచిన్నాలు చీనాపంచదార, రెండుచిన్నాలుకలిపి రెండుపూటలాపుచ్చుకోవలెను. ఇచ్ఛాపథ్యం తీపి తినరాదు.

(3) కరక్కాయపెచ్చులు రాత్రినీళ్ళలోనానవేశి మరుచటిరోజుఉదయం ఆపెచ్చులనుగట్టిగాపిడిచి ఆవునేతిలో దోరగావేయించి. పెద్ద పల్లేరువేళ్ల కషాయంతో కుంకుడుగింజలవలె మాత్రలుచేశి ప్రతిపూటా భోజనానంతరం రెండుమాత్రలు చొప్పున సేవించవలెను. ఇచ్ఛాపథ్యం.

(4) తంగేడువేళ్లచూర్ణముగాని తంగేడుపువ్వుచూర్ణముగాని మేకవెన్నతో పుచ్చుకోవలెను

(5) కృష్ణాభ్రకము త్రిఫలచూర్ణము కలిపి వేడినీళ్ళతో పుచ్చుకోవలెను.

అతిసారము— అధికముగా గాని, వికృతిగా గాని అయ్యెడు విరోచనములు.

(1) బాలింతబోలు, రసచిందూరము, వేపజిగురు, ఇంగువ, చింతపండు, సున్నము, నల్లమందు, హారతికర్పూరము వీటిని అరటికాయచెనతో నూరి కందిగింజలవలె మాత్రలు చేసి, వాముమాడ్చిన నీళ్ళతో రెండేసివిరేచనముల కొక మాత్రాదు చొప్పున యివ్వవలెను. వాముకాటునీళ్ళవల్ల కొంతమందికి వాంతివచ్చుట గాని, గుడించుటగాని తటస్థించును. అట్టివారికి నీళ్ళతో గాని, మజ్జిగతోగాని యివ్వ

(1) కళ్ళకలకకి వాపువంటి కాగానె బ్రహ్మదండిచెట్టాకు (పిల్లలు పెలని వాటిగింజలను కుక్కకుని అడుమండు చెట్టుచెట్టాకు) రోజు 1కి రెండుమూడుసార్లు కళ్ళలో పెట్టుచున్నయడల కళ్ళకలక త్వరలో మానును.

(2) ఉత్తరేణాకు పసరు పిండవలెను.

(3) అన్నం చిమిడేలా వండి ఆ అన్నంలో పసుపు, ఆవునెయ్యి వేసి పనికి బిళ్లలు వలె చేసి కన్నులపయిని కట్టవలెను.

(4) బజారులో విక్రయింపబడు నేత్రబిందు సీసా వాడవలెను. నేత్రబిందు వాడునప్పుడు ఇతరమందులు వాడరాదు.

(5) పటిక పొంగించి నీటితో కలిపి పోయవలెను. యీ పటికపొలు కళ్లకలక మళ్ళు మొగం పట్టినతర్వాత పోయవలెను.

(6) మూరెడు పొడవుగల పురుగుడుపుల్లకు చివర ఒక చిన్నసీసా తగిలించి, ఆసీసా మూతికిపైని దారముతో పుల్లకు ఏనుగుమెలికవేసి ఆదారమును సీసా మూతికి కట్టవలెను. (ఇట్లు కట్టుటచే పుల్లను త్రిప్పునప్పుడు సీసాజారి పడిపోకుండా వుండును) పిమ్మట ఆపుల్లకు మొదటిభాగమందు తాడు కట్టి సత్తువకొలది దానిని చక్రపాట్లం త్రిప్పినట్లు గిరగిరాత్రిప్పినయడల పుల్లలోవున్న చొన సీసాలోనికి చేరును. తర్వాత (పురుగుడుపాలను) ఆనీటిని ఉదయం సాయంకాలములయందు రెండేసి బొట్లు చొప్పున కంటిలో వేయుచుండినయడల కలకలు, వాపులు మొదలయిన అనేకరోగములు తగ్గును.

అధ్రిషము — తాలుమూలమున యర్రగావాచిబాధకలిగి మెత్తనైయుండును (ఇగుళ్లవాపుకు చేసే చికిత్సలు చేయవలెను)

అనాస — (గ్రామ్యపదము) గుదపాకరోగమును యీ పేరుతో వాడుచున్నారు. గుదపాకమనగా చిన్నపిల్లలకు కలిగే ముడ్డి ఒరుపు.

(1) పుండుమానే చికిత్సలు చేయవలెను.

(2) అనాసదుంప (లాంగలి) వేసి కాచిన ఆముదముపెట్టినచో తగ్గుననియు, యీ కారణమువల్లనే ఈవ్యాధికి అనాసజబ్బని పేరనియు కొంతమంది చెప్పుదురు.

అనాహము — మూత్రపురీషబద్ధమై కడుపు ఉబ్బెడు రోగము. ఆమమయినను, మలమయినను సరిగా వెడలక కోష్ఠమున నిలచియుండి వాతాదులచేశుష్కింప చేయబడినది.

(1) సాధువిరేచనకారులను వాడవలెను.

(2) కడుపుపయిని కాపడములు పెట్టుటవలన ఉపయోగ ముండును.

అనుశయి— పాదముపై చర్మ సమానవర్ణముగానుండి ఉన్నతముగా ఉబ్బి, లోలోపలనే పక్వమయ్యెడుకురుపు.

(1) అష్టశుద్ధులచేసిన గంధకము పుచ్చుకొనవలెను—

అపచారజ్వరము— అపథ్యాహారవిహారములచే జనించిన జ్వరము—

అపచి— చీముకాయుచు తమంతటతామే పుట్టి తమంతటతామే నశించుచు చాలాకాలమువరకు బాధించుచుండు గడ్డ మొదలయినవి.

అపస్మారము— స్మృతితప్పి ఏమియు తెలియక వికారముగా చూచుచు కాళ్ళుచేతులు కొట్టుకొనుచు పడిపోయియుండును మూర్ఛ, లేక స్త్రీలకువచ్చెడి "కాకినోమాల" యనురోగము, కొందరికి నోటనురుగులు కారుచు ఇంచుమించుగా దయ్యముపట్టినవారిచేష్టలు కలిగియుండును. కొందరికి కాళ్ళుచేతులు బిగుసుకొనిపోయి స్మృతి లేకుండును. కొందరికి నోటనురుగులుండవు. స్మృతియుండును.

(1) ఒకనిమ్మపండురసంలో ఒకఔన్సునీళ్ళుపోసి తగుమాత్రం సోడాకలిపినయెడల పొంగువచ్చును. దానినిరోగబలమునుబట్టి రోజు1కి రెండుమూడుసార్లు పుచ్చుకొనవలెను. భోజనమయినవెంటనే వమనమయ్యెడువ్యాధి పైత్యవ్యాధి. వికారము, శూల, పైత్యసంబంధమయినమూర్ఛ ఇవన్నియు తగ్గును.

(2) పర్పాటకచూర్ణం పూట1కి రెండుచిన్నాలుచొప్పున మేహతత్వంకలవారు గొర్రెపాలతోగాని, ఒర్రెపాలతోగాని, వాతతత్వంకలవారు ఆవుపాలతోగాని, మేకపాలతోగాని పుచ్చుకొనవలెను.

(3) మండలం (నలుబది) రోజులువిడవకుండా ఉదయంపూట ఒక నారదబ్బపండుతినవలెను. అవసరమయితే ఉప్పుచేర్చుకోవలెను ఇచ్ఛాపథ్యం.

అభిఘాతజ్వరము— దెబ్బతగులుట, దూరమునడచుట, తనశక్తికిమించిన ప్రయాసపడుట, మొదలయినవాటిచే జనించినజ్వరము.

(1) తాత్కాలికోపయోగములయిన ఉపచారములుచేయవలెను—

అభిష్యందము — కళ్ళనుండి నీళ్ళుకారెడురోగము.

అరతలనొప్పి— పార్శ్వపునొప్పి (1) శొంఠిగంధం నల్లమందుకలిపి పట్టు వేయవలెను.

(2) శీలకర్రి బ్రాందితోగాని, చనుపాలతోగాని నూరిపట్టువేయవలెను.

(3) నొప్పిగానుండు పార్శ్వమునున్న చెవిలో తెల్లకాకరాకుపసరు పిండవలెను.

(4) నొప్పిగలప్రదేశమందు దూలగొండాకు కట్టవలెను. దూలగొండాకుకట్టినస్థలంలో నూగుగుచ్చుకుని దద్దురెక్కినయెడల చింతపండు గుంజుపట్టు వేయవలెను.

అరుచి — అన్నమునందిచ్ఛకలిగియు భుజింపశక్తిలేకుండుట, భావనజీలకర్ర రోజు1కి రెండుమూడుసార్లు చప్పరించవలెను. భావనజీలకర్రచేయువిధము మాదీఫలరసంలో తగుమాత్రము సైంధవలవణంకలిపి, జీలకర్రపోసి పగటిభాగమున, జీలకర్రను, రసమునువిడివిడిగా ఎండబెట్టుచు రాత్రిభాగమున ఏకముచేయుచు రసము యింగిరపోయేవరకు చేయవలయును. పిమ్మటదానిని చలికంపురాకుండా మధ్యమధ్య యెండబెట్టుచుజాగ్రతచేయవలెను. భావనకునిమ్మ, పుల్లదబ్బపళ్ళరసం రెండపక్షము.

అరూంషికము — శిరమునందు చీముకారుచు బయలుదేరు అనేకముఖములు గల కురుపులు. దీనివేపురిమాదయని కొందరందురు.

అర్జునము — కంటియందుండు తెల్లగుడ్డులో జనించిన యెర్రచుక్క.

అర్బుదము — పార్లగడ్డలేక శరీరమునందెచ్చటనో ఒకదగ్గరవాచినవాపు.

అర్మము — దుర్మాంసము.

అరోచకము — అరుచి లేక అసహ్యము.

అర్శోరోగము — గుదస్థానమునలోపలగాని, వెలుపలగాని, మాంసపుమొలకలు మొలిచి వేదనకలిగించురోగము. (ఇదేమూలశంక).

(1) పాలములలోమనం పెంచకుండా దానంతట అదిబయలుదేరిన కందదుంప (అడవికంద) పుటంపెట్టి రెండుతులముల గుంజులో వకతులం పేరుకొన్న నెయ్యికలిపి ప్రాతఃకాలమందు పుచ్చుకొనవలెను పెసరపప్పు, కందఇగురు, ఆవుపెరుగు, పెరుగుతోటకూరపథ్యము. ఈప్రకారము పద్ధెనిమిదిరోజులుచేయవలయును.

(2) యింగిలీకం, ఆవుపాలు. వెన్న, మర్దించి గుడ్డకుపట్టించి ఆగుడ్డనుయెండించి వత్తివలెచేసి గోతిలోపెట్టివెలిగించి ఆగోతిపైని తిరగలిబల్లవేసి కూర్చుని ఆతిరగలి బల్లయొక్క రంధ్రముగుండా వచ్చేపొగను ఆసనముకు పట్టించవలయును.

(3) ముళ్లతోటకూర సమూలము మెత్తగానూరి చిట్టాముదంతో ఉడికించి బిళ్లవలెచేసి ఆసనముపైని కట్టవలెను. పిలకలు ఊడి పడిపోవును.

అలజీ — కంటిలో తెల్లగుడ్డునకున్ను, నల్లగుడ్డునకున్ను మధ్యభాగమున ద్రాక్షపండువంటి బొబ్బలేచి పోటుపుట్టి నీరుకారును.

అలస — (పాసిపోవుట) కాళ్ళవ్రేళ్లకును చేతివ్రేళ్లకును కలిగెడు ఒరువు.

(1) పుండుమాను మందులను వేయవలయును.

(2) నూనె మొదలయిన స్నిగ్ధ పదార్థములను వాడవలెను.

(3) కిరాతనాయిలు వాడి పసుపు అద్దవలెను. మరదలు మానును.

అలసక — కడుపుబ్బరించి మలమూత్రములు వెడలవెనక దాహముకలిగియుండును.

అలసకము — అగ్నితుండిక చూడవలెను.

అవపాటికము — అంగము చివరభాగమున పగులుట.

(1) గుగ్గిలము, ఇంగిలీకము, నువ్వులనూనె, నెయ్యి, మైనము వీటినిగరిటెతో కరిగించి గుడ్డకు పట్టించివేయవలెను.

(2) మ్యాదారుచిన్ని, జంగాలపచ్చ, అరిదళం (తాళకం) వీడెత్తు చొ॥ సేకటిచిన్ని పావలాయెత్తు మైనము, గుగ్గిలము రెండేసి తులములు చొ॥ చూర్ణించి నూనె మరగబెట్టి మైనం వేసి అదియునం కరిగినతర్వాత గుగ్గిలము వగయిరాల పొడుం వేసి కలియగలిపి పాకానికివచ్చినతర్వాత దించి జాగ్రతపెట్టి ఆపాలస్త్రీ గుడ్డకు పట్టించి వేయుచుండవలెను.

(3) రేలచెక్క, ఆరువెల్ చెక్క, మామిడిచెక్క, పిప్పలికట్టె వీటిని చూర్ణించి చిట్టాముదంతో వుడికించి గుడ్డకు పట్టించివేయుచుండవలెను.

(4) రసచిందూరం, పాదరసకర్పూరం, కొబ్బరినూనె కలిపి ఆరారగా రాయుచుండవలెను. కురుపులు, పుండ్లు, పగుళ్లు, వగయిరా అన్నిటికిన్ని యీ పాలాస్త్రీ పనికివచ్చును.

అశ్మరి — మూత్రరోగభేదము, మూత్రము కష్టముగా వెడలుటగాని, మూత్ర శుక్రము లేకనైన కష్టముగా వెడలుటగాని, మూత్రము గడ్డవలె గట్టిపడి, వెడలకుండుటగాని, కలిగియుండును.

(1) రావిపండు, పంచదార, జీలకర్ర వీటిని మెత్తగా నూరి యీతవేళ్ల రసంతో యివ్వవలయును.

(2) ఉదయముననే బియ్యం కడిగి, ఆకడుగు, సాయంకాలమువరకు ఎండించుచు సాయంకాలము వడబోయుచు మరుచటిరోజున యీకడుగుతోనే బియ్యము కడిగి సాయంకాలమున వడకట్టుచుండవలెను. యీప్రకారం యిరవైయొక్క రోజు వరకు చేసి అప్పటికి మిగిలియున్నదానిలో నిమ్మకాయరసము, సైంధవలవణం తగుమాత్రం కలిపి సీసాలో పోసి కార్కు వేసి దాచి విస్తారం కాకచేసినప్పుడు వకతులమెత్తు ఇవ్వవలెను.

(3) ఎలక, పందికొక్కు, గబ్బిలము వీటిలో ఏపెంటికలనయినా చనుపాలతో నూరి బొడ్డుపయిని పట్టు వేయవలెను. (గబ్బిలపు పెంటికలు సులభసాధ్యము)

(4) సోడా, నీళ్లలోవేసి, పంచదారకలిపి ఇవ్వవలెను.

(5) ఆముదాలు ఒలిచి ఆపప్పును మెత్తచేసి నూరి నాభిపైనగాని, పొత్తికడుపుపైన గాని వేసి కట్టవలెను. దోసగింజలగంధము కూడాపనిచేయును.
(6) సూరేకారం, రేవలచిన్ని, పటికనీళ్లలోకలిపి యివ్వవలెను. ఇండుపకాయనీళ్లతో అరగదీసి ఆగంధంలో తగుమాత్రం పటికబెల్లం చూర్ణం కలిపి కుంకుడుగింజలగాయితు గచ్చకాయంతకుంటకు ఇవ్వవలెను. మూత్రం పట్టువిడిపోవును. గాని చిరకాలం యివ్వరాదు. నాభి శైత్యంచేయును.

అశీతివాతములు—

అష్టవిధమూత్రకృచ్ఛ్రములు—

అష్టవిధశూలలు—

అష్టవిధోదరములు —

అసృగ్దరము— కుసుమరోగము.

(1) బేదానాలు, వట్టివేళ్ళు, సజ్జాగింజలు, ఫీటినినీళ్ళతోనూరి, కుంకుడుగింజలవలె మాత్రలుచేశి పుచ్చుకోవలెను. ఇచ్ఛాపథ్యం,
(2) తవాక్షీరి, కుంకుమపువ్వు, మిరియాలు, నాగకేసరాలు, పొర, కలగర, కడుగుతోనూరి, కుంకుడుగింజలవలె మాత్రలుచేశి పుచ్చుకోవలెను. ఇచ్ఛాపథ్యం.
(3) నల్లేరునూరి, ఒకగింజతీసిన చింతపండుగుల్ల, పట్టినంత చింతపండు మాటుతో ఉదయం మూడుపూటలు పుచ్చుకోవలెను. చప్పిడిపథ్యం,
(4) రేగుగింజలలోనిపప్పు, బెల్లము, నెయ్యి, ఫీటినిమాత్రలుచేశి సేవించవలెను.
(5) ఉత్తరేణిఆకురసము నెత్తిమీదమర్దనా చేయవలయును.
(6) నేతిలోలక్కనుకరిగించి దానిని పాలలోకలిపి త్రాగవలెను.

అస్థిగతజ్వరము— పురాణజ్వరము, (జీర్ణించిపోయినజ్వరము).

అస్థిస్రావము— తెల్లకుసుమ.

అహిపూతనము— శిశువులకు మలమూత్రములు జరిగినవెంటనే తడిగుడ్డతో తుడుచుటగాని, కడుగుటగాని, చేయనియెడల కురుపులు ఒయలుదేరి ఒకదానితో ఒకటి కలుసుకొనిపోయి విస్తరించెడు స్వభావముకల కురుపులు.

అంగముమణగలాగుకుపోవుట— ఏరోగమయిననుసరే శిశ్నము మొదట్లోకంటా మణగలాగుకొనిపోయినచో ఎంతతెలివిగాఉన్నాసరే ఆరోగిజీవించడని తెలియవలయును.

అంగసంధాలవాపు— కీళ్ళసంధులవాపు.

అపస్మారకాలు— మనుష్యులకు సోకినమూర్ఛను చేయవలెను. చికిత్స, మనుష్యులకువలె వాటికి కూడా మర్దనా చేయవలెను

అండరోగము— వృషణముల వాపు.

(1) కొబ్బరికోరు ఆముదముతో వెచ్చచేసి కట్టవలెను
(2) ఆవిసెవేళ్ళు చితుకగొట్టి ఆముదముతో వెచ్చచేసి కట్టవలెను.
(3) మేకపెంటికలు కర్పూరబిళ్ళ కాగితిపాము, నీళ్ళతో నూరి వెచ్చచేసి కట్టవలెను
(4) కందులు నీళ్ళతో మెత్తగానూరి ఉడికించి గోరువెచ్చగా ఉండగా పూయుచున్నయెడల ఎంటిపిల్ల వరిబీజం మానిపోవును.
(5) కాకిదొండవేళ్ళుగాని, పచ్చివేళ్ళుగాని, ఆవునేతితో ఉడికించి కట్టవలెను.
(6) నల్లమందు వేడినీళ్ళతోగాని, బ్రాందీతోగాని, అరగదీసి వేయవలయును.
(7) తాటిమొవ్వు మెత్తగానూరి ఆముదంతో వెచ్చచేసి కట్టవలయును.
(8) తడిగుడ్డ గోచీ పెట్టవలయును.
(9) గచ్చవేళ్ళు ఆముదంతో వెచ్చజేసి కట్టవలెను.
(10) తాండ్రపిడచలోనిపప్పు. నల్లమందు వేడినీళ్ళతో అరగదీసి వేయవలయును.
(గలకసంబంధమయిన వ్యాధులకుకూడా ఇదేచికిత్స)

అండవృద్ధి— అండరోగము.

అండవాతము— వృషణములలో ఒకటిగాని, రెండుగాని వాచి పోటుకలిగి ఉండును.

అంతరకుసుమ— కంటిలోని పువ్వు.

అంతర్దాహము— బాధతెలియని తాపము.

అంతర్విద్రధి— గుల్మము కంటె పెద్దది

అంత్రాలజి— గట్టిగాను. ఉబ్బెత్తుగాను ఉండు కురుపులు పుట్టి, వాటి చుట్టూ ఆవాలువంటి కురుపులు ఒయలుదేరి స్వల్పమయిన చీముకలిగి యుండును.

ఆగంతుకరోగము — దెబ్బతగులుట, శక్తికిమించిన పనులు చేయుట, బరువు మోయుట, క్రూరజంతువులతో పోరాడుట, మొదలయినవాటిచే జనించినది. బ్రాందీ యివ్వవలెను

అంత్రవృద్ధి— వాతము ప్రకోపించి సన్నని పేగులలో ఎక్కడనో ఒక భాగమును సంకోచింపచేసి వాటివాటి స్థానమునుండి క్రిందకు సడలింపచేసి గజ్జల యందుచేరి జనించు గ్రంధి (బిళ్ళ) రూపమయిన వాపు.

(1) జిల్లేడాకురసంతో తీసిన శొంఠిగంధం వెచ్చచేసి వేయవలయును.
(2) గంధఫిరోజాను, వెచ్చచేసి గుడ్డను పట్టించి బిళ్ళ, లేక కంతులపైని వేయవలెను.

చాలాబాపతులు కంతులు, గడ్డలు, బొబ్బలు మొదలయినవి దీనివలన హరించును. గంధకశిరోజా కిరాణాకొట్లమీగ దొరకును.

(3) పిండికట్టు కట్టవలెను.

(4) బాలింతబోలి నిమ్మపండు రసంలో నూరివేయవలెను.

(5) గోరింటాకు ముద్ద కట్టవలయును.

(6) దేవాలయములో నుండు గన్నేరువేరు మెత్తగా అరగతీసి వేయవలెను.

(7) యీతమొవ్వు, పంచదార సాకంవచ్చేలా నూరి బిళ్ళగాచేసి కట్టవలెను

ఆధ్మానము— గుడగుడశబ్దముకలిగి నొప్పితోకూడుకొన్న కడుపుబ్బరము.

అనికాయు — ముల్లు మొదలయినవి రాక లోపలదిగడుటచే అరిపాదమున ముల్లు విరిగిన స్థలమునందు బయలుదేరుగ్రంధి.

(1) ఏనుగులద్ది మర్దనచేయుచుండుటవలన హరించును.

(2) కాలిలోవిరిగినముల్లురాక దిగపడిపోయినయెడల అచ్చటనైనైని పొష్పరతీసి, మైలతుత్తం మంచినీళ్లలో అరగదీసి, అగింధంపొప్పరతీసిన స్థలంలో పెట్టినయెడల మంటమండి, పట్టుపిరేసరికి ఆమంటకూడా చల్లారును. మైలతుత్తగంధం ఎండినతర్వాతఊడదు. పిమ్మట రెండుమూడురోజులు పోనిచ్చి, మెంతులనీళ్ళలో నానపెట్టి మెత్తగానూరి ఆమెంతిపిండి కట్టినచో ఎంతలోతునవిరిగినముల్లుఅయినా తప్పకవచ్చును. నేర్పుగా చీముపిండవలెను అట్టిసమయములోనే ముల్లుపైకి వచ్చును.

ఆమము— (ఆమదోషము) భుజింపబడిన పదార్థము సరిగాజీర్ణముగాక కడుపులో ఘనీభవించియున్నది.

ఆమాతిసారము — దీనినేజిగటవిరేచనములనియు, ఆమవిరేచనములనియు అందురు.

ఆయాసము — ఒగర్పు.

ఆర్తవదోషము— (ఆర్తవరోగము) కుసుమ లేక సోమరోగము. తెల్లకుసుమను శ్వేతప్రదరసమనియు. యర్రకుసుమను రక్తప్రదరమనియు చెప్పెదరు.

ఆవర్తవ్రణము — సుడివంటిఆకారముగల కురుపు.

ఆసనగండమాల — ఆసనము, గజ్జలు, కంఠము, చంకలు మొదలయిన ప్రదేశములయందుగాని వాటిచుట్టుగాని, మాలవలె జనించెనేని ఆప్రదేశములనుబట్టి ఆసనగండమాల, వంక్షణగండమాల, గలగండమాల, కక్షగండమాల. అనిచెప్పుదురు. కంఠమందుజనించిన ఒంటిగ్రంధిని గళగండమందురు.

ఆహ్నికజ్వరము — రోజువిడిచి రోజుగాని మూడురోజులకుగాని, నాలుగు రోజులకుగాని, వచ్చుచుండుజ్వరము. దీనినె నాల్గవజ్వరమనియు, చాతుర్థికజ్వరమనియు చెప్పుదురు.

(1) నిమ్మకాయ, ముప్పై కాయలవలె తరిగి దానిలో అయిదు క్వయినా బిళ్లలుగాని, అయిదు పొట్లములలోవున్న క్వయినా గాని, పెట్టి పిండి మూసి పులుము పెట్టి సాంగశీతలముగ గింజలు, తొక్కలు సహితం పాకంవచ్చేలా నూరి గురిగింజలవలె మాత్రలుచేసి పూట 1కి రెండుమాత్రలు చొప్పున నీళ్ళతో పుచ్చుకొనవలయును. ఇచ్ఛాపథ్యం. ఎంతజంపజాలజ్వరమయినాసరే జ్వరజాతిఅంతయు శమించును. క్వయినావల్ల సంభవించే చెముడు, తిప్పు మొదలయిన యెట్టివికారములున్ను కలుగవు. అవసరమునుబట్టి మోతాదులను సవరించుకొనుచుండవలెను.

ఇగుళ్ళవాపు— (1) జాపత్రి కషాయం పుక్కిలుపట్టి ఉమియవలెను.

(2) కొంతిపొడుం అద్దవలయును.

ఇరివెల్లిక — శిరస్సుపైని మిక్కిలిబాధకలిగి సుందర్యముగా లేచెడుకురుపులు.

ఇరుకునొప్పి— (బెణుకునొప్పి)

(1) గలిజేరు సమూలంనూరి గాని, వేపాకు నూరిగాని ఆముదంతో వెచ్చచేసి కట్టవలెయును.

(2) ఆముదం రాసి తేలికగా తోమవలెను.

(3) నొప్పిగల అవయవమునకు సంబంధించిన చెయ్యి, లేక కాలివేళ్ళ మెటికలు విరువవలెను.

(4) నొప్పిగల అవయవమునకు దిళ్లెట్టుపక్కనుండు కాలుగాని చేయిగాని జాడించవలెను.

ఇంద్రలుప్త — పేను కొరుకుట, లేక ఒట్టితల అందురు. గడ్డము, మీసము ఊడిపోయిన, ఇంద్రలుప్త, తలవెంట్రుకలుమాత్ర మూడిపోయిన. ఖాలిత్యము, ఈ రెండుప్రదేశములయందు గాక శరీరమునం దెచ్చటనయినను వెంట్రుక లూడిపోయిన రుహ్యాము. అని ఈప్రకారము భేదములను గుర్తించవలెను.

(1) చేదుపొట్లాకు రసము రాయుచుండవలయును.

(2) మాడీమాడకుండా కాల్చిన ఏనుగుదంతమును గాని, ఏనుగుగోరజను గాని మెత్తగా నూరి అచ్మార్గము, హారతికర్పూరము కొబ్బరినూనెలో కలిపి రాయుచుండవలెను.

(3) గుంటగలగరాకు నిజరసం, కొబ్బరినూనె సమానంగా కలిపి రసం యిగిరిపోయేలాగు కాచి ఆనూనెను రాయుచుండవలెను.

(4) ఊడుగుగింజల తైలం రాయవలెను.

(5) గుంటగలగరాకు ముద్దగా నూరి ఆముద్దకు నాలుగురెట్లు స్వరసమున్ను నూనెయు కలిపి నూనె మిగులునట్లు కాచి దానిలో ఏనుగుదంతమును గాని ఏనుగుగోరిజలను గాని మాడ్చిన బూడిదనున్ను, ఊశరికవలుపు మాడ్చిన బొగ్గునున్ను కలిపి రాయుచుండిన ఊడిపోయిన వెంట్రుకలు గుబురుగా పెరుగును.

(6) ఏనుగుదంతమును పుటముపెట్టి ఆచూర్ణము, రసాంజనము, మేకవెన్న కలిపి పూయుచుండవలెను.

(7) నల్లజీడిగింజలు నూనెలో వేసి కాచి ఆనూనె రాయుచుండవలెను.

(8) కొర్రెలను మాడ్చి ఆమసి నూనెలో కలిపి రాయుచుండవలెను.

ఇంద్రవిద్ధ— మధ్యభాగమందు తామరపువ్వు బొడ్డువంటి ఆకారముగల కురుపున్ను దానిచుట్టూ చిన్నచిన్న కురుపులున్ను ఉండును.

ఉదరరోగము— శరీరముకృశించుట, తెల్లపారుట, భుజములు, తుంట్లు యెండిపోవుట, కడుపులోబల్లగాని. నీరుగాని, బిళ్ళగాని బయలుదేరుట, ఇట్టి చిహ్నములు కలిగియుండును.

ఉదర్దము— దద్దుర్లు. (1) చింతపండు రాగిపళ్లెంలో నానపెట్టి పిసికి ఆ పులుసు ఒళ్ళంతా పట్టించవలెను.

(2) జీలకర్ర వేయించి మెత్తగా చూర్ణించి ఆవునేతిలో కలిపి రాయవలయును.

(3) పుల్లమజ్జిగతో గంగరావిచక్క గంధం తీసి రాయవలెను.

(4) పెద్దబచ్చలాకు మెత్తగా నూరి రాయవలెను.

(5) గంగరావిచక్క చూర్ణం యిరవైనాలుగు తులములు, పిరంగిచక్క చూర్ణం పన్నెండు తులములు, లవంగాలు, యాలకులు, శొంఠి, పిప్పలి, మిరియాలు, కరక్కాయ, తాడికాయ, ఉశిరికాయి. అనుపత్రికం, సీమగులాబీపువ్వులు, దినుసు ఒక్కింటికి తులంచొప్పున చూర్ణించి ఆచూర్ణమునకు రెట్టింపు పటికిబెల్లంపాకం పట్టి అందులో ఆవునెయ్యి తేనె అరసోలడుచొప్పున పోసిపైచూర్ణములను కలియగలిపి పూట1/4తులంచొప్పున, పుచ్చుకొనిన సమస్తవిధపైత్యములు శమించును

ఉదావర్తము— మూత్రపురీషములు అతికఠినముగా వెడలుటగాని, నోటిద్వారా వెడలుటగాని, కలిగియుండునది.

ఉన్మంథకము— కుట్టినచెవిని బలాత్కారముగా పెంచుటచే జనించినవాపు, ఇదినొప్పిలేకవాపు కలిగియుండును.

(1) నువ్వులనూనె వెచ్చపెట్టి దానిలోగుడ్డముక్కముంచి శమనగా కొంతకాలం

పొలుసు కారుచుండునట్లు చేయును. ఉప్పురాయి. మిరియాలపొడి, మంచినీళ్ళతో నూరి గీచి అగంధం చేయుచుండవలెను. కన్నుతో సోలుచేసిన సుగంధపు కాయలవంటి పొక్కులు, కంతులు, త్వరగాపోవును

ఉన్మాదము— (పిచ్చి) అపస్మారము.

ఉపజిహ్వక – (అధిజిహ్వక.)

ఉపదంశము — మర్మావయవముల యందులేచు కొరుకుపుండ్లు (సవాయి)

(1) రసకర్పూరము, మదారుచిన్ని, ఆమదశిలగంధకము, కసిరి, వెన్నతో నూరి పట్టించుచుండవలెను

(2) సీమనేపాళంచెట్టు మొదట ('స్తంభమునకు) కత్తినాటుపెట్టినయెడల వచ్చినపాలతో రసకర్పూరం కుండపెంకుమీద ఆరగతీసి అగంధంరాసినయెడల బాధవెంటనే శాంతించును.

ఉబ్బసము— ఊర్ధ్వకాస (1) తెల్లవాకుడుకాయలోని గింజలుతీసివేసి ఆ గుల్లనిండా పిప్పళ్ళునూరిపెట్టి పుటమువేసి పాతబెల్లంతో కుంకుడుగింజలవలె మాత్రలుకట్టి జామునకు ఒక్కొక్కటిచొప్పున చప్పరించుచుండవలెను.

ఉరక్షతము — రొమ్ముపగులకొట్టినట్లుగాని, శూల, పోటినట్లుగాని యుండును దగ్గినప్పుడు నల్లగాగాని. పచ్చగాగానియుండు చిక్కనికఫము రక్తముతోకలసి వెలువడుచుండును.

ఊచరపోట్లు — (1) శొంఠి, బియ్యము మెత్తగానూరి నీళ్ళతోఉడకపెట్టి ఉడుకుచుండగా పటికబెల్లం, నెయ్యితగుమాత్రంవేసి కలియగలిపి చల్లారినతర్వాత జాగ్రతపరచి ఉదయం పరగడుపున కుంకుడుకాయంత చొప్పున తినిపించవలెను.

(2) షాము యిర్లకైతులములు దోరగావేయించి మెత్తగానూరి వస్త్రఘాలితముచేసి దానిలో వస్త్రఘాలితముచేసిన కరిధూపము. పసుపుతులముచొప్పున వేసి ముప్పది తులములతాటిబెల్లం రోటిలోవేసి పయి గుండపోసి పాకమువచ్చేలాగున త్రొక్కవలయును. త్రొక్కుచుండగాగాని తర్వాతగాని దిగుడాయినూని లేహ్యపాకమునకు సరిపోవులాగునపోసి, ప్రతిరోజునా ఉదయానే పరగడుపున గచ్చకాయంత తినిపించుచుండవలయును.

ఊర్ధ్వజత్రురోగము— మూపుసంధులకు పైభాగమందుండేడు, ముక్కు, కన్ను, చెవి, ముఖము, మొదలయినవాటికి సంబంధించిన రోగము.

ఊపిరిగొట్టునొప్పి— హిధ్మ, ఊపిరిపీల్చునప్పుడు వెన్నుతోగాని, హృదయమునగాని, పక్కలయందుగాని ఊపిరి అందకుండా కలుగు అనిర్వాచ్యమయిననొప్పి.

(1) రాయివలె గట్టిగానున్న బెల్లముక్క బుగ్గను పెట్టుకొని ఊటమింగుచుండవలెను.
(2) ఉప్పు కాపడం పెట్టవలెను (3) సోడాపుచ్చుకోవలెను. (4) పుచ్చుకోగలిగినంత వేడిగానున్న మంచినీళ్లనుగాని, కాఫీగాని, టీగాని, పాలనుగాని, పుచ్చుకోవలెను

ఊరుస్తంభము - తొడలుకదలింపవీలులేక బరువుకలిగిమిక్కిలి బాధగానుండును.

ఋతుశూల— ముట్టుతోకలిగెడు కడుపునొప్పి.

(1) శొంఠి, పిప్పలి, మిరియాలు, సైంధవలవణం, ఇంగువ, వెల్లుల్లి, ఇవి మెత్తగానూరి కుంకుడుగింజలవలె మాత్రలుచేసి బహిష్ఠఅయినదిలగాయతు పూటకు ఒకటిగాని, రెండుగాని మాత్రలను వేడి నీళ్ళతో పుచ్చుకోవలయును. (ఇందులో కొంతమంది గచ్చపప్పును స్వల్పముగావేసి మాత్రలుకట్టు ఆచారముకలదు). ఈలావకపర్యాయమునకు తగ్గనియెడల బహిష్ఠుఅయినప్పుడెల్లా రెండుమూడు పర్యాయములు వాడవలెను చప్పిడి పథ్యము.

(2) నల్లఉప్పివేళ్ళు, పాతబెల్లం సావలా ఎత్తుచొప్పున కలియనూరి కుంకుడుగింజలవలె మాత్రలుచేసి బహిష్ఠుదినములలో ఉదయాన్నే ఒకటిగాని, రెండుగాని, మాత్రలువేడినీళ్లతో వేసుకోవలెను. చప్పిడిపథ్యం.

(3) తంగేడుపువ్వులు రెండుతులములు, తామరపువ్వులోనికేసరములు అరతులంనూరి వుస్తిపండ్లవలె మాత్రలుకట్టి ప్రతిరోజూ ఉదయము సాయంకాలము ఒకటిగాని, రెండుగాని, మాత్రలను పంచదారతో పుచ్చుకొనవలయును. మాత్రకాడమునకు అవసరమయితే ఆవుపాలు ఉపయోగపరచవలెను. ఋతుకాలమునందుండు బాధ, మంట, శూల. చాలాకాలమువరకు బాధించు ఋతుస్రావము తగ్గును.

(4) శొంఠి, వాము, గసగసాలు, కవిరి, పోకచెక్క, సోపు, వీటినివేయించి పొడుంకొట్టి వస్త్రఘాలితంచేసి బెల్లంతో కుంకుడుగింజలవలె మాత్రలుచేసి కాపుపట్టకుండావున్న మామిడిచెక్కరసంతో పుచ్చుకోవలెను. కాపుపట్టనిమామిడినే కన్నెమామిడి అనిచెప్పుచుందురు.

ఋతుస్రావము— ఆర్తవదోషము. బహిష్ఠులోగాని స్నానమయినతర్వాతగాని యోనిద్వారమునుండి స్రవించుమైల.

(1) నల్లటిసున్నపుకుండలో నల్లగాతేరినతేట ఉదయంఒక అర ఔన్సుచొప్పున యిచ్చుచుండవలెను.

ఎండదెబ్బ— వడగొట్టుట, తరవాణిగాని, మజ్జిగగాని, గంజిగానిపట్టించవలెను.

ఎక్కిళ్ళు— హిక్క, (1) నెమళ్ళపైనుండు పింఛముగని కాల్చి తేనెలో చేర్చి చుట్టవలెచుట్టి కాల్చవలయును.

(2) తామరగింజలచూర్ణము నీళ్లతో సేవించవలెను.

(3) అల్లముక్కను ఉప్పులోనూరి పండినపిప్పళ్లనెయ్యితో కల్పి అనుక్రమముగా రసముగొని నమలుచు ఊటమింగుచుండవలెను

ఎలుకకాటు— (1) గోగునులక తాడుకాల్చి ఎలుకకరచిన స్థలమందు ఆ పొగపట్టించుచుండవలెను.

(2) పులిసినకడుగు, లేతపత్తిఆకురసం, కలిపిగాని వెంపలిరసంలో పటికబెల్లం కలిపి గాని ఇవ్వవలెను. ఇచ్ఛాపథ్యం.

(3) సూర్యోదయం కాకుండా రోజూ ఒక కొబ్బరిబొండంలోని నీరు త్రాగుచుండవలెను. ముక్క తినరాదు ఇచ్ఛాపథ్యం.

(4) దిరిసెనగింజలు, వేపాకు, గచ్చపప్పు, ఆవుపంచితంతో నూరి కరచినస్థలమందు రాయుచుండవలయును.

(5) విషదుష్టమగు ఒక్కొక్క ఎలుక ఒంటిమీదపడినను పాకినను. దానిస్పర్శతగిలినంతమాత్రముననే శరీరమున గ్రంథులు బయలుదేరి అపాయస్థితిసంభవించును గ్రంధులనుండిరక్తము వచ్చునట్లుచేసి వాటిపయిని గాడిదమలమును ఉచ్చచేసిన చేయుచుండవలెను.

ఏటికిపాములు— ఇవి కడుపులో పెరిగి నులకపురుగులు. గుండ్రటిపాములు, లేక చను కలిసి ఆసనమునుండిగాని నోటినుండిగాని పడును. ...లో వెల్లుల్లిరేకలు

(1) ములగగింజలు. చెంగల్వకోష్టు మెత్తగానూరి తేనెతో నాకించవ...

(2) తురకవేపచక్క కషాయం ... వాయువిడంగాలచూర్ణ... ...ణాని జనించువాపు. కలిపి ఉదయాన్నే త్రాగవలెను.

(3) విషముష్టిగింజలచూర్ణం అడ్డగెత్తు (రెండుగురిజలెత్తు) వేడినీ... యాన్నే త్రాగవలెను.

(4) గొలుగువేళ్ళు చితుకగొట్టి తేనెతో వృష్టికాయంతమాత్ర వేసి ఉదయ ...ల్లని తేట నీళ్లతో వేసుకోవలెను.

(5) వాము తోకమిరియాలు కషాయంతీసి త్రాగవలెను.

ఒరుపు — అంసల

ప్రస్ఫోటనము — పెదవులు పగులుట (1) వెన్న మొదలయిన జిడ్డుపదార్థములను రాయవలెను

